# చందమామ

ఈ సంచికలో కథలు

వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.











బ్రిటానియా వారే ప్రత్యేకంగా తయారుచేసే యీ గోల్డెన్ పఫ్ బిస్కట్లు తాజాగా కరకరలాడుతూ వుండి పుష్టినిచ్చును. కాఫీ, టీ, త్రాగేటప్పుడు సేవించుటకు అనువైనవి. జామ్, వెన్న, జున్నులతో కూడ సేవించవచ్చును. రుచి చూడండి — నోట్లో కరిగిపోతాయి. నేడే కొనండి. కమ్మగా రుచిగా వుండే యీ తాజా బ్రిటానియా గోల్డెన్ పఫ్ బిస్కట్లను సేవించి ఆనందించండి.

## బ్రిటానియా బిస్కట్లు







JWTBC 3910 A



# ప్రశ్నోత్తరాలు

CHITRA

1. *టి. ఎస్. ఏ. పద్మనాభయ్య, టెంకణికోట*

ఎన్ని పెళ్ళిపెత్తనాలు వచ్చినప్పటికిని కొరడాదెబ్బల నిచ్చు సమందల్ రాజు అకస్మాత్తుగా చివరకు బ్రద్‌బసీమును కౌగలించుకొని, ఆమె (తన కుమార్తె) నిచ్చి వివాహము చేయుటయుందలి కారణము తెలుప గోరుతున్నాను.

రాజ్యభ్రష్టుడై కారాగృహంలో కొంతకాలం ఉన్న మీదట సమందల్ రాజు కళ్ళు పొరలు విచ్చుకుని ఉంటాయి.

2. *రాపేటి రామకృష్ణారావు, మారేడుపల్లి*

ప్రచండవేగంతో సూర్యుని చుట్టూ సంవత్సరం తిరిగి భూమి పెద్ద వలయాన్ని చుట్టి వస్తుంది గదా, ఇంత తిరిగినా ఉత్తర ధృవతార అక్కడే వుంటుందేం ?

సూర్యుడి చుట్టూ భూమి తిరిగే పెద్ద వలయం యొక్క వ్యాసం 17 కాంతి నిమిషాలకు లోపు, ఎందుకంటే సూర్యుడికీ భూమికీ ఉండే దూరం 8న్నర కాంతి నిమిషాలకన్న తక్కువ. ధృవతార (దక్షిణ ధృవతార లేదు.) 1,085 కాంతి సంవత్సరాల దూరాన ఉన్నది. దీనినిబట్టి దాని స్థానచలనం ఎందుకు కానరాదో మనం సులువుగా గుణించవచ్చు. సుమారు 17,000 మైళ్ళ దూరాన ఉన్న వస్తువును ఎడమ కంటితో చూసినదానికీ, కుడి కంటితో చూసినదానికీ స్థానం మార్పు ఎంత ఉంటుందో, ఏడాది పొడుగునా ధృవతార స్థానంలో కలిగే మార్పు అంతే ఉంటుంది. అంతకంటె 24 గంటల కాలంలో ధృవతార స్థానంలో కలిగే మార్పు చాలా హెచ్చు. అది భూమి యొక్క ధృవానికి సూటిగా వుండక, ఒకటింబాతిక డిగ్రీలు పెడగా ఉండటంచేత 24 గంటల కొకసారి అది అతి చిన్నవలయం ఒకటి చుట్టుతూ ఉంటుంది.

3. ఎస్. కోటేశ్వరరావు, ఖర్గపూరు

నవంబరు సంచికలో ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ, తిరుగుతున్నది భూమే, సూర్యచంద్రులు కారు అని వ్రాశావు. "చందమామా", ఇన్నాళ్ళూ నువ్వు మా చుట్టూ తిరుగుతున్నా వనుకుంటున్నాను...

ఆ ప్రశ్న చంద్రుడు భూమి చుట్టూ తిరగడానికి సంబంధించినది కాదు.

4. పాలిమోహన్ బాబు, ఏలూరు

అన్నయ్యా, లంక హనుమంతుని చూచినట్లు లంకలో గల రాక్షసులు చూడకుండుటకు కారణమేమి ?

లంకలో ప్రవేశించే ప్రతి ప్రాణినీ చూడటం లంక కర్తవ్యం. "పిల్లి ప్రమాణం" గల ప్రతి కోతినీ రాక్షసులు చూస్తూ కూర్చుంటారా ?

5. ఎస్. ఎల్. కె. ప్రభావతి

అన్నయ్యా, "చందమామ" నిండా అవీ, ఇవీ వేస్తున్నారు, ఎందుకని ? వాటి బదులు కథలు వేయవచ్చుగా ?

"చందమామ" లోని అన్ని శీర్షికలూ పాఠకులకు రుచించాలనే మా ఉద్దేశం. ఈ సంచిక నుంచీ కథల పేజీలు మరి నాలుగు పెంచాం.

6. కె. రెడ్డిశేషాద్రి, కమ్మచెరువు

అన్నయ్యా, (ఆధునిక) విమానములు సుమారు ఎంత ఎత్తులో ఎగుర గలవు ? పగటివేళ వాటి నీడ భూమిపై పడగలదా ?

రష్యా, చీనాదేశాల వారు పడగొట్టినట్టు మనం పత్రికలలో చదివిన యు-2 విమానాలు 60 వేల అడుగుల ఎత్తులో ఎగర గలవు. ఇది మంచి ఎత్తు కిందనే జమ. వాటి నీడ భూమిపై పడటం అసంభవం. సూర్యకాంతిలో ఏ వస్తువు నీడ అయినా దాని ప్రమాణానికి సుమారు 120 రెట్ల దూరం దాటి పడదు.

7. ఎం. వి. రాజు, బరంపురం

నేను బేతాళ కథ పంపిస్తే ప్రచురిస్తారా ?

"కల్పిత" బేతాళ కథలై ఉండి, ప్రచురణ యోగ్యంగా ఉంటే ఎవరు పంపినా వేస్తాము—వేస్తున్నాము కూడా.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచిక నుంచి "చందమామ"లో కొన్ని మార్పులు చేస్తున్నాం. "పాఠకుల లేఖలు", విజ్ఞాన వ్యాసాలూ ఎత్తివేస్తున్నాం. "ప్రశ్నోత్తరాల" శీర్షికను అదనపు పేజీల లోకి మార్చి, సంచికలో కథల పేజీలను అధికం చేశాం.

ఫోటో వ్యాఖ్యల పోటీకి పంపేవారు కొందరు రెండు వ్యాఖ్యలనూ చెరొక కార్డు పైననో, రిప్లై కార్డు పైననో వ్రాస్తున్నారు. ఇది వారికి నష్టమూ, మాకు కష్టమూనూ. కార్డు పైన వ్యాఖ్యలు రెండూ పక్కపక్కనే ఉండాలి.

సంపుటి 34 ఫిబ్రవరి 1964 సంచిక 2





# భారత చరిత్ర



తుగ్లక్ వంశం సుల్తాన్ మహమ్మద్‌తో అంతరించగా, ఢిల్లీ ప్రముఖులు తమలో బలవంతుడైన దౌలత్‌ఖాన్ లోదీని గద్దె ఎక్కించారు. అయితే, భారతదేశంలో తీమూర్ ప్రతినిధి అయిన ఖిజ్ర్‌ఖాన్ తాను పాలించే ముల్తాను నుంచి సేనలతో వచ్చి, 1414 మే ఆఖరులో ఢిల్లీని వశపరుచుకున్నాడు. దౌలత్ ఖాన్ ఖైదీ అయి హిస్సార్‌ఫీరూజాకు పంపబడ్డాడు. ఖిజ్ర్‌ఖాన్ మహమ్మదు ప్రవక్త సంతతివాడని కొందరు చరిత్రకారుల నమ్మకం. అందుచేత అతని వంశానికి సయ్యిద్ వంశమని పేరు పెట్టారు. అతను సమర్థుడు కాడు. అతని ఏడేళ్ళ పరిపాలనలో విశేష మేమీలేదు. ఢిల్లీ సామ్రాజ్యం ఢిల్లీ చుట్టూ ఉండే కొద్ది జిల్లాలు దాటలేదు. ఈ కొద్దిమేరలో కూడా తరుచు తిరుగుబాట్లు జరిగేవి. వాటిని అణచటానికి ఖిజ్ర్‌ఖాన్‌తో బాటు అతని మంత్రి తాజుల్ముల్క్ కూడా తీవ్రంగా కృషి చేశాడు. 1421 లో కొద్ది నెలలు తేడాగా ఇద్దరూ చనిపోయారు.

ఖిజ్ర్‌ఖాన్ చనిపోయిన రోజునే (1421 మే 20) అతని కొడుకు ముబారక్ షా ఢిల్లీ ప్రముఖుల అనుమతితో గద్దె ఎక్కాడు. ఇతను కూడా సమర్థుడు కాడు ; కొద్ది తిరుగుబాట్లు అణచినప్పటికీ, ఇతని హయాంలో ఖోకర్ల ప్రతిఘటన హెచ్చింది. ఇతని ఆస్థానంలోని హిందువుల పలుకుబడి కూడా పెరిగింది. యమునాతీరాన ముబారకాబాద్ అనే నగరం నిర్మింపజేస్తూ, దాన్ని పర్యవేక్షించటానికి వెళ్ళిన సమయంలో హిందూ, ముస్లిము కుట్రదార్లు ఇతన్ని హతమార్చారు. 1434 ఫిబ్రవరి 19 న జరిగిన ఈ హత్యకూ, కుట్రదార్లకూ నాయకుడు ఇతని వజీరు సర్వరుల్ముల్క్.

ఇతని అనంతరం ఇతని వారసుడు ముహమ్మద్ అనే వాడు సుల్తానయాడు.

## 29. సయ్యిద్‌లూ, లోదీలూ



ఇతనూ అసమర్థుడే. కుట్రదారైన సర్వరుల్ముల్క్ చనిపోయిన అనంతరం ఇతను తన సామర్థ్యం ప్రదర్శించి ఉండవలిసింది. కాని అలా జరగలేదు. మాల్వరాజైన మహ్మూద్ షా ఖల్జీ ఢిల్లీ పైకి వచ్చాడు. అప్పుడు సుల్తానుకు సహాయంగా వచ్చిన లాహోరు గవర్నరు బుహ్లూల్‌ఖాన్ లోదీ, తానే ఢిల్లీ సుల్తాను కావటానికి యత్నించాడు. ఈ ప్రయత్నం విఫలమయినప్పటికీ, సయ్యీద్‌ల స్థితి నానాటికీ దిగజారిపోయింది. ఢిల్లీకి ఇరవై కోసుల దూరంలో ఉన్న సామంతులు కూడా తిరుగుబాటుకు సిద్ధపడ్డారు. ముహమ్మద్ షా 1445 ప్రాంతంలో పోయాడు. అతని కొడుకు అలా ఉద్దీన్ ఆలమ్ షా సుల్తానయే సరికి అతని ఏలుబడి కింద ఢిల్లీ నగరమూ, దాని చుట్టుపక్కల కొద్ది గ్రామాలు మాత్రమే ఉన్నాయి! ఈ కొత్త సుల్తాను పాత వారే మేలనిపించాడు; ఇతను రాజ్యాన్ని 1451 లో బుహ్లూల్ ఖాన్ లోదీ పరం చేసి, పారిపోయి తన అభిమాన ప్రదేశమైన బదాఊన్‌లో నివసించాడు.

బుహ్లూల్ ఖాన్ భారతచరిత్రలో ఢిల్లీ సింహాసన మెక్కిన మొదటి అఫ్ఘానీయుడు. ఇతను అఫ్ఘాన్ లోదీ తెగకు చెందినవాడు. ఇతను లాహోరు, సిర్హిందులను రాజ ప్రతినిధిగా పాలిస్తూ, ఆలమ్ షా వదిలి పోయిన సింహాసనాన్ని, హమీద్ ఖాన్ అనే మంత్రి సహకారంతో, 1451 ఏప్రిలు 19 న అధిష్ఠించాడు. ఇతను, తన ముందు వచ్చిన వారిలాగా కాక, సమర్థుడు, యోధుడు, చురుకైనవాడు. తోటి అఫ్ఘానుల సహాయంతో అతను హమీద్‌ఖాన్‌ను ఖైదులో పెట్టి, అతని ప్రభావాన్ని అరికట్టాడు. చాలా ఏళ్ళుగా స్వాతంత్ర్యం అనుభవిస్తున్న మేవాత్, సంభల్, మైన్పురీ, సుకేత్, రేవరీ మొదలైన వలసల నేలే వారిని లోబరుచుకున్నాడు. జౌన్పుర్ పై యుద్ధం చేసి జయించి,

1486 లో తన పెద్ద కుమారుడైన బార్బక్ షాను అక్కడ రాజ ప్రతినిధిగా నియమించాడు. గ్వాలియర్ రాజైన కిరత్‌సింగ్‌ను శిక్షించి తిరిగి వస్తూ, దారిలో జబ్బుచేసి, జలాలీ వద్ద 1489 జులై మధ్యకాలంలో మరణించాడు.

1489 జులై 17 న సుల్తాను రెండవ కొడుకు నిజామ్ ఖాన్, సుల్తాన్ సికందర్ షా అనే పేరుతో, జలాలీ వద్ద కొత్త సుల్తానుగా ప్రకటించబడ్డాడు. ఇతను చాలా శక్తివంతుడు. ముగ్గురు లోదీ సుల్తానులలోకీ ఇతనే హెచ్చు సమర్థుడు. ఇతను రాజ్యంలోని అరాజకాన్ని తగ్గించటానికి శ్రద్ధగా కృషి చేశాడు. ప్రముఖులైన అఫ్ఘాన్ జాగీర్దార్ల ఆస్తి వివరాలన్నీ తణిఖీ చేయించాడు. సామంతులను అదుపులో పెట్టాడు.

1504 లో ఇతను నేటి ఆగ్రా ఉండే చోట ఒక నగరం నిర్మించి, చివరిదాకా తిరుగుబాటుదార్లను సమర్థతతో నిగ్రహించుతూ, 1517 నవంబరు 21 న ఆగ్రాలోనే మరణించాడు.

ఇతను పోయిన నాడే ఆగ్రాలో ఇతని పెద్ద కొడుకు ఇబ్రాహీమ్ సుల్తాను అయాడు. ఆ సమయంలో ఇబ్రాహీమ్ తమ్ముడైన జలాల్ ఖాన్‌ను జౌన్పుర్‌కు రాజు చెయ్యాలని కొందరు చేసిన ప్రయత్నం విఫలమయింది. జలాల్ పట్టుపడి చంపబడ్డాడు.

కొత్త సుల్తానుకు యుద్ధ నైపుణ్యం ఉన్నదిగాని, సమయజ్ఞుడు కాడు. ఇదే ఇతనికి చేటు తెచ్చింది. తన బలం పెంచుకోవాలని ఇతను ఉన్నతోద్యోగులైన లోహనీ, ఫార్ముళీ, లోదీ తెగలకు చెందిన ప్రముఖులను అతిగా వేధించాడు. అఫ్ఘాన్ ప్రముఖులంతా ఇతనికి శత్రువులై కూర్చున్నారు. సుల్తానుకు కావలిసిన వాళ్ళే అయిన దౌలత్‌ఖాన్ లోదీ, ఆలంఖాన్‌లు కాబూలును పరిపాలించే బాబుర్‌ను ఇండియా పైకి రావలసిందిగా ఆహ్వానించారు!






# మహాభారతం

ఒకప్పుడు విశ్వామిత్రుడూ, కణ్వుడూ, నారదుడూ ద్వారకకు వచ్చారు. రోహిణీ వసుదేవుల కొడుకైన సారణుడూ, మరి కొందరు యాదవులూ కలిసి, జాంబవతీ కృష్ణుల కొడుకైన సాంబుడికి ఆడవేషం వేసి మునుల వద్దకు తీసుకుపోయి, "మహా మునులారా, ఈమె గర్భవతిగా ఉన్నది. తమకు తెలియనిదంటూ ఉండదు. ఈమె కేబిడ్డ పుట్టుతుందో చెప్పండి," అని అడిగారు. మునులు ఆగ్రహించి, "వీడు సాంబుడు. వీడి కడుపున ఇనప రోకలి (ముసలం) పుట్టి వృష్ణి, అంధక వంశాలను నిర్మూలిస్తుంది," అని శపించి, కృష్ణుణ్ణి చూసి, తమ దారిన తాము వెళ్ళిపోయారు. వాళ్ళు అన్నట్టుగానే సాంబుడికి మర్నాడే ఒక ముసలం పుట్టింది. కృష్ణుడు దానిని చూర్ణం చేయించి, ఆ చూర్ణాన్ని తీసుకుపోయి సముద్రంలో కలపమని ఆజ్ఞాపించాడు.

తరవాత ద్వారకలో ఒక చాటింపు జరిగింది: నగరంలో వారెవరూ మద్యం తాగరాదు; ఈ నియమం వృష్ణి అంధకులకు కూడా వర్తిస్తుంది; ఎవడైనా తాగినట్టయితే, వాణ్ణీ, వాడి బంధువులనూ కూడా కొరతవేస్తారు.

శాపకారణంగా జరిగిన ఈ చాటింపు విని నగరంలోని ప్రతి ఒక్కరూ తాగరాదని నియమం పెట్టుకున్నారు.

వారెంత జాగ్రత్తగా ఉన్నప్పటికీ దుశ్శకునాలు కలిగాయి. నగరవీధులలో ఎలుకలు అసంఖ్యాకంగా తిరిగాయి. ఎక్కడ చూసినా కుండ పెంకులు కానవచ్చాయి.

పక్షుల కూతలూ, జంతువుల అరుపులూ మారిపోయాయి.

ఈ వైపరీత్యాలు గమనించి కృష్ణుడు యాదవులతో, "భారత యుద్ధానికి ముందు కూడా ఇలాటి వైపరీత్యాలే కలిగాయి. అవి

అట్ట చివరి బొమ్మ




జననాశాన్ని సూచిస్తాయని ధర్మరాజు అన్న మాట నిజమే అయింది," అన్నాడు. అతను యాదవుల నందరినీ సముద్రతీరానికి యాత్రకు బయలుదేరదీశాడు. వృష్ణి, అంధకులందరూ తమ తమ భార్యలతో సహా సముద్రతీరానికి ప్రయాణమయారు. భక్ష్యభోజ్యాలూ, మద్య మాంసాలూ సిద్ధం చేయించారు. ఏనుగుల మీదా, రథాల మీదా, గుర్రాల మీదా వెళ్ళి, సముద్రతీరాన తమ ఇష్టానుసారం బసలు ఏర్పాటు చేసుకున్నారు. కృష్ణుడి చిన్ననాటి మిత్రుడైన ఉద్ధవుడు యాదవ వీరులను సముద్రం ఒడ్డుకు తీసుకుపోతుంటే కృష్ణుడు వద్దని కూడా అనలేదు.

ఇక యాదవుల ప్రవర్తనకు హద్దూ పద్దూ లేకుండా పోయింది. వారు ఆహారాన్ని కోతులకు వేశారు. వాద్యాలు మోగాయి. నృత్యాలు ఆరంభమయాయి. అందరూ తాగ నారంభించారు. కృష్ణుడి సమీపంలోనే కూర్చుని బలరాముడూ, కృతవర్మా తాగటం మొదలుపెట్టారు. సాత్యకీ, బభ్రువూ, గదుడూ కూడా తాగారు. సాత్యకి తాగిన మత్తులో కృతవర్మతో, "నీవు కాబట్టే ఆనాడు అశ్వత్థామతోబాటు నిద్రపోయే వారిని చంపావుగాని, అది క్షత్రియుడు చేసే పనీ, యాదవులు హర్షించే పనీకాదు," అని ఎత్తిపొడిచాడు. ప్రద్యుమ్నుడు కూడా కృతవర్మను తూలనాడాడు.

"అవునవును. చెయ్యి తెగి, ప్రాయోపవేశం చేసిన భూరిశ్రవుణ్ణి చంపిన నీవే గొప్ప క్షత్రియుడివిరా!" అన్నాడు కృతవర్మ. కృష్ణుడు కృతవర్మ కేసి కోర చూపు చూశాడు. "ఈ నీచుడి తమ్ముడు శతధన్వుడే గద శమంతకమణి కోసం సత్రాజిత్తును చంపింది?" అన్నాడు సాత్యకి కృష్ణుడితో. ఈ మాట విని సత్యభామ ఏడుస్తూ, కృష్ణుడి తొడ పైన చతికిలబడి

అతనికి కోపం తెప్పించింది. "నీ పూరుకో వమ్మా, ఈ దుర్మార్గుణ్ణి ఇప్పుడే ధృష్ట ద్యుమ్న శిఖండుల దగ్గిరికి పంపేస్తాను," అంటూ సాత్యకి లేచి, కత్తితో కృతవర్మ తల నరికాడు.

కృతవర్మను చంపినందుకు భోజులంద రికీ కోపం వచ్చి, సాత్యకిని చుట్టుముట్టి, తాము తాగటానికి ఉపయోగించిన పాత్ర లతో అతన్ని కొట్టారు. అది చూసి ప్రద్యు మ్నుడు భోజుల మీదికి వెళ్ళాడు. భోజు లందరూ చేరి సాత్యకినీ, ప్రద్యుమ్నుణ్ణీ చంపేశారు. కృష్ణుడికి కోపం వచ్చి పిడికెడు తుంగ పీకాడు. అది కాస్తా ఇనపరోకలి అయింది. దానితో అతను ప్రముఖులంద రినీ చంపాడు. ఆ తుంగనే పీకి భోజులూ, అంధకులూ, శైనేయులూ, వృష్ణి వంశం వారూ అనే యాదవజాతుల వారందరూ ఒకరినొకరు చంపుకున్నారు. వారి చేతుల్లో ఒక్కొక్క తుంగ కాదా ఒక్కొక్క ముసల మయింది. తప్ప తాగి తండ్రి కొడుకులు సైతం ఒకరినొకరు చంపుకున్నారు. చేతిలో ముసలం పట్టుకుని ఉన్న కృష్ణుడు, చావగా మిగిలిన యాదవులను పూర్తి చేశాడు. అప్పుడు బభ్రువూ, దారుకుడూ కృష్ణుని వద్దకు వచ్చి, "అయ్యా, అందరినీ చంపే




శారు. ఇక బలరాముడుగారిని వెతుకుదాం పదండి," అన్నారు.

వారు ముగ్గురూ బలరాముణ్ణి వెతు క్కుంటూ వెళ్ళి, ఆయనను ఒక చెట్టు దగ్గిర చూశారు. ఆయన విచారంతో ఉన్నాడు. కృష్ణుడు దారుకుడితో, "వెంటనే హస్తినాపురానికి వెళ్ళి యాదవ వినాశనం గురించి చెప్పు. అది విని అర్జునుడు తప్పక వస్తాడు," అన్నాడు. దారుకుడు రథం తీసు కుని బయలుదేరాడు. తరవాత కృష్ణుడు బభ్రువుతో, "నీవు వెళ్ళి ఆడవాళ్ళను కాపాడు. లేకపోతే నగల కోసం దొంగలు

వారిని పీడించవచ్చు," అన్నాడు. బభ్రువు బయలుదేరాడు గాని, ఎంతో దూరం వెళ్ళక మునుపే అతని పైన ముసలం పడి చంపే సింది. అప్పుడు కృష్ణుడు బలరాముడితో, "అన్నా, నేను స్త్రీ జనాన్ని ఊరు చేర్చి వస్తాను. అంతదాకా ఇక్కడనే ఉండు," అన్నాడు. అతను స్త్రీలను పురానికి చేర్చి వసుదేవుడితో, "ఆడవాళ్ళను జాగ్రత్తగా కని పెట్టి ఉండాలి. బలరాముడు అర్జునుడి రాక కోసం ఎదురుచూస్తూ వనంలో ఉన్నాడు. నేను కూడా అక్కడికే పోతాను. యాదవు లంతా చచ్చిన ఈ పురంలో నాకు ఉండ బుద్ధి కావటం లేదు. నేనూ, అన్నా వనం లోనే తపస్సు చేసుకుంటాం," అంటూ, ఆయన కాళ్ళకు నమస్కరించి వేగంగా వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోతుంటే స్త్రీలు ఆర్తనాదాలు చేశారు. "మీ కేమీ భయం లేదు. అర్జునుడు వస్తాడు," అని కృష్ణుడు వారితో అని బలరాముడి పద్దకు వెళ్ళిపోయాడు.

బలరాముడు యోగసమాధిలో ఉన్నాడు. అతని ముఖం నుంచి తెల్లని సర్పం వెలువడి సముద్రంలోకి వెళ్ళిపోయింది. అలా వచ్చిన ఆదిశేషును వరుణలోకంలోని నాగ ప్రముఖులు పూజించి, అర్చించారు. బలరాముడు దేహం చాలించటం చూసిన కృష్ణుడు నిర్జనమైన వనంలో కొంతసేపు తిరిగి, ఒకచోట పడుకుని యోగనిద్ర అవలంబించాడు.

అక్కడికి జరుడనే బోయవాడు వేటకు వచ్చాడు. వాడికి కృష్ణుడి పాదం కనబడింది. అదేదో మృగమని వాడు ఆ పాదాన్ని బాణంతో కొట్టాడు. తరవాత వాడికి మనిషి అన్న సంగతి తెలిసి పశ్చాత్తాపంతో కృష్ణుడి కాళ్ళు పట్టుకున్నాడు. కృష్ణుడు జరుణ్ణి ఓదార్చుతూనే ప్రాణాలు విడిచాడు. అతని శరీరంలో నుంచి గొప్ప తేజస్సు బయలుదేరి పైకి వెళ్ళిపోయింది. దానికి దేవతలూ, అప్సరసలూ, మునులూ ఎదురువచ్చి స్వాగతం ఇచ్చారు.






## 32

[ మొసళ్ళ మడుగు వద్ద కేశవుడూ అతడి అనుచరులను బిడాలీ, శ్వానకర్ణీ రక్షించారు. ఆ తరవాత కేశవుడు తన మిత్రులిద్దరితో కలిసి, గుహావాసుల సాయం వల్ల కొండశిఖరం మీది నుంచి ఒకానొక లోయలోకి దిగాడు. అక్కడ వాళ్ళకు భయంకరపక్షి నొకదాన్ని చేత బట్టుకుని గంతులు వేస్తున్న గణాచారిలాటి వాడొకడు కనిపించాడు. తరవాత—]

లోయలోకి దిగుతూనే తమకు ప్రత్యక్షమైన ఈ వింత దృశ్యం చూసి కేశవుడూ, అతడి అనుచరులు ఆశ్చర్యపోయారు. జయమల్లు గణాచారిగ్గాని, అతడి ఎదురుగా చేరి డప్పులు వాయిస్తూ నాట్యం చేస్తున్న అతడి అనుచరులగ్గాని, కనబడకుండా వుండేందుకు, దాపుల నున్న ఒక మహా వృక్షం ఎక్కాడు.

ఆ వెంటనే కేశవుడూ, కోయగోమాంగ్ కూడా చెట్టు మీదికి పాకారు.

"వీళ్ళెదో నరమాంస భక్షకుల్లా కనబడుతున్నారు. ఆ గండభేరుండ పక్షిని చేత బట్టుకుని చిందులు తొక్కేవాడు, వాళ్ళ నాయకు డనేందుకు సందేహంలేదు. మళ్ళీ మనం చిక్కుల్లో పడలేదు గదా!" అన్నాడు జయమల్లు.

జయమల్లు మాటలకు కేశవుడేదో జవాబు చెప్పబోయేంతలో, గణాచారిలా గంతులు వేస్తున్న వాడు తన అనుచరుల కేసి తిరిగి, పెద్దగా గొంతెత్తి, "మన కష్టాలన్నిటికీ




కారణం, శత్రువులు మన గండభేరుండ పక్షి మాతల్ని సంహరించటమే. ఆ పక్షి మాతల్ని మనం కాపాడామో, ఆ మాతలు మనను కాపాడుతవి. గండభేరుండాల్ని రక్షించే సాహసం మీలో ఎవకైనా వున్నదా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు జవాబుగా అతడి అనుచరులు ఈటెలు పైకెత్తి, "గండభేరుండాల్ని పట్టుకుని, వాటి రెక్కలు నరికి ఎత్తుకు పోతున్న వాళ్ళెవరో మాకు తెలుసు. ఈనాటి నుంచి ఆ దుర్మార్గుల్ని ఈ ప్రాంతాల అడుగు పెట్టకుండా చేయగలం. యిదే, మా ప్రతిజ్ఞ!" అన్నారు.

"అలా అయితే, యిక వెళ్ళండి. రాత్రనక పగలనక, ఆ పక్షి మాతలు నివశించే లోయ ప్రాంతాలను శత్రువుల నుంచి కాపాడండి," అంటూ గణాచారి తన చేతిలో వున్న గండభేరుండపక్షిని వదిలేశాడు.

"ఇదీ సంగతి! పులుగురాయుడి ముఠా వాళ్ళు యీ ప్రాంతాల వున్న గండభేరుండ పక్షుల్ని పట్టుకుని, వాటి రెక్కలు నరుక్కుపోతున్నారన్న మాట," అన్నాడు జయమల్లు తల పంకిస్తూ.

"వాళ్ళు చేస్తున్న ఈ దుండగాల వల్ల మనం చిక్కులోపడే ప్రమాదం వున్నది. మనం యీ గణాచారిగాడి అనుచరుల కంట బడితే, మననూ రెక్కల మనుషుల కింద జమకట్టి హత మార్చేందుకు ప్రయత్నిస్తారు," అన్నాడు కేశవుడు.

"మనకు అడుగడుగునా అవాంతరాలే. రాకాసిలోయను సమీపిస్తున్నామన్న సంతోషం ఏమీ లేకుండా పోయింది. వీళ్ళను తప్పుకుని కొండల్లోని ఆ సొరంగ మార్గం తెలుసుకోవటం ఎలా?" అని ప్రశ్నించాడు కోయగోమాంగ్.

ఈ విధంగా చెట్టుకొమ్మల్లో దాగి వున్న ఆ ముగ్గురూ ఆలోచిస్తున్నంతలో గణాచారి కొద్ది మంది తన అనుచరుల్ని వెంటపెట్టు

కుని వెళ్ళిపోయాడు. కేశవుడూ వాళ్ళు మరికొంతసేపు కొమ్మల్లోనే వుండి, ఆ చుట్టుపక్కల ఎవరూ లేరని ధృవపడిన తరవాత మెల్లిగా చెట్టు దిగి వచ్చారు.

"ప్రస్తుతానికి ఆ గణాచారిముఠా భయం లేదు. బిడాలీ, శ్వానకర్ణీ చెప్పిన ఆ సొరంగ మార్గమేదో తెలుసుకుంటే రాకాసిలోయకు చేరవచ్చుగదా," అన్నాడు కోయగోమాంగ్.

ఆ మాటలకు జయమల్లు నవ్వి, "ఇన్ని కొండలూ, గుట్టలూ వున్న ఈ ప్రదేశంలో మనకు కావలసిన సొరంగమార్గం వెతకటం తేలికకాదు. మనం ముందు ఈ లోయలో నివశించే వాళ్ళ కంటబడకుండా మెలకువతో వుండాలి. అది చాలాముఖ్యం," అన్నాడు.

కేశవుడు నిశ్శబ్దంగా చెట్లచాటున నడుస్తూ అల్లంత దూరంలో వున్న కొండల కేసి చేయిచూపి, "మనం ఆ ప్రాంతాలకు ఏ ప్రమాదం లేకుండా చేరగలిగితే, ఆ తరవాత ఆ సొరంగ మేదో కనుక్కోవచ్చు. మాట్లాడకుండా నడవండి," అన్నాడు.

ఆ తరవాత ముగ్గురూ కొంతదూరం నడిచి ఒక కొండప్రాంతాన్ని సమీపించారు. ఆ కొండ ఎగుడు దిగుడుగా వున్న పెద్ద పెద్ద బండరాళ్ళతో నిర్జనంగా కనిపించింది. ఆ ప్రాంతాల గణాచారి అనుచరు లెవరూ



లేరని నిశ్చయించుకున్న తరవాత కేశవుడూ వాళ్ళు చెట్ల చాటు నుంచి బయిటికి వచ్చి, కొండను సమీపించబోయారు.

హఠాత్తుగా వాళ్ళకు ఎదురుగా వున్న ఒక ఎత్తయిన ప్రదేశం నుంచి కేకలు వినిపించినై. ముగ్గురూ తలలు ఎత్తి అటుకేసి చూశారు. నలుగు రైదుగురు అడవి మనుషులు వాళ్ళ కేసి ఈటెలు ఊపుతూ, "ఎవరు మీరు? వెనక్కు తిరిగిపోండి. ఒక్క అడుగు ముందుకు వేశారో ప్రాణాలు దక్కవు. గండభేరుండాల రెక్కలు నరుక్కుపోయే మీ దుర్మార్గం యిక సాగదు," అని పెద్దగా అరిచారు.



వాళ్ళ కేకలకు జవాబుగా జయమల్లు, "మేము గండభేరుండపక్షుల రెక్కలు నరుక్కుపోయేందుకు వచ్చిన వాళ్ళం కాదు. మా దారిన మమ్మల్ని పోనివ్వండి," అని కేకవేశాడు.

జయమల్లు మాట ముగిసేలోపలే కొండ మీది నుంచి పెద్ద పెద్ద రాళ్ళు వేగంగా వచ్చి వాళ్ళు నిలబడిన చోట పడసాగినై. కోయగోమాంగ్ రాళ్ళు విసిరే వాళ్ళతో ఏదో అనబోయేంతలో జయమల్లు అతడి భుజం పట్టుకు వెనక్కు లాగుతూ, "నువ్వేమి చెప్పినా, వాళ్ళ నుంచి నీ కొచ్చే జవాబు రాళ్ళవర్షం తప్ప మరేంవుండదు. వెనక్కు తిరిగి వాళ్ళ దెబ్బకు అందకుండా పారిపోవ టమే ప్రస్తుతానికి క్షేమం," అన్నాడు.

జయమల్లు వెనకగా కేశవుడూ అతణ్ణి అనుసరించి కోయగోమాంగ్ కొంతదూరం పరిగెత్తి, అక్కడ వున్న రాళ్ళవెనక ఆయాస పడుతూ కూచున్నారు. కొంచెంసేపు ఎవరూ మాట్లాడలేదు. గణాచారి అనుచరులు తమను వెన్నంటి వస్తున్నారేమో అన్న భయంతో, వాళ్ళ అలికిడి కోసం జాగ్రత్తగా కొద్దిసేపు విని, అలాంటిదేమీ లేకపోవటంతో ముగ్గురూ తృప్తిగా ఒక నిట్టూర్పువిడిచారు.

"మనం రాకాసిలోయను చేరేందుకు ఉపయోగపడే సారంగ మార్గం ఎక్కడ వున్నదో నాకు తెలిసిపోయింది," అన్నాడు జయమల్లు. కేశవుడూ, గోమాంగ్ అతడి కేసి ఆశ్చర్యంగా చూశారు.

జయమల్లు చిరునవ్వు నవ్వుతూ, "ఆశ్చర్యపడకండి. రాకాసిలోయ అనేది ఈ కొండల వెనక ఎక్కడో వున్నదనిగదా, బిడాలీ, శ్వానకర్ణి చెప్పింది. అంటే యీ కనబడే కొండలు దానికి ఒక వైపున వున్న అనకట్ట లాంటి వన్నమాట. వీటిని ఎక్కిచూస్తే లోయా, అవతల మరొక కొండల సోలుపూ కనబడిడే, ఆ మధ్యనున్న లోయ, రాకాసిలోయ!" అన్నాడు.



"అలా అయితే వాళ్ళు చెప్పిన 'ఒకానొక సారంగం' మాటేమిటి?" అని అడిగాడు కోయగోమాంగ్.

"ఒకానొక; అనటంలోనే ఆ బిడాలికీ, శ్వానకర్ణికీ యీ ప్రాంతాల గురించిన వివరాలేవీ బాగా తెలియవని తెలిసిపోతున్నది. ఆ రాకాసిలోయకు వెళ్ళి తిరిగి వచ్చినవాడెవడూ లేడని వాళ్ళే చెపుతున్నారు గనక, ఆ సారంగం అదీ అంతా పుక్కిటిపురాణం ఎందుక్కాగూడదు?" అన్నాడు జయమల్లు.

"అలా అయితే, మనం ఏ విధంగా అయినా గణాచారి అనుచరుల కనుగప్పి, వాళ్ళున్న కొండప్రాంతం చేరాలని నీ అభిప్రాయం. అంతేనా, మల్లూ?" అని అడిగాడు కేశవుడు.

జయమల్లు అవునన్నట్టు తలవూపి, "మనం చీకటిపడ్డ తరవాత బయలుదేరటం మంచిది. ఈ లోపల యిక్కడే కాలక్షేపం చేద్దాం. ఇక్కడ శత్రుభయం ఉండదని నా నమ్మకం. ఆకలిగావున్నది. ఏదీ, మనం వెంట తెచ్చుకున్న ఆహారం బయిటికి తీయండి," అన్నాడు.

కోయగోమాంగ్ పెద్ద పెద్ద టేకు చెట్టు ఆకులలో కట్టివున్న ఆహారాన్ని కట్టువిప్పి జయమల్లూ, కేశవుడి ముందు పెట్టాడు.




ఆ తరవాత ముగ్గురూ తృప్తిగా భుజించి సూర్యాస్తమయం అయేవరకూ అక్కడే కాలం గడిపారు.

సూర్యాస్తమానం అయిన కొద్దిసేపటికి చంద్రోదయ మయింది. కేశవుడూ అతడి మిత్రబృందం కొండ ఎక్కేందుకు ప్రయాణమయారు. జయమల్లు తన అనుచరుల కేసి తిరిగి, "ఈ వెన్నెల మనకూ, గణాచారి ముఠా వాళ్ళకూ కూడా అనుకూలమైనదే. మనం ఈ ప్రాంతాలకు కొత్త గనక, దారి మార్గం వెతుక్కోవటానికి ఉపయోగంగా వుంటుంది, శత్రువులకు కూడా మన చర్యలు గుర్తించటం తేలిక. కనక, సాధ్య



మైనంత వరకూ చెట్ల చాటున—చీకటిలో నడవండి," అన్నాడు.

ముగ్గురూ ఆ విధంగా చీకటి మాటున నడుస్తూ, కొండప్రాంతం కేసి కొంతదూరం నడిచే సరికి, ఎదురుగా ఒక చెట్టు కింద నల్లని ఆకారం ఒకటి కదిలిన సవ్వడి వినిపించింది.

ఆ వెంటనే ముగ్గురూ అక్కడ గుబురుగా వున్న పొదలచాటున నక్కి కూచుని, ఆ ఆకారం కేసి పరీక్షగా చూశారు.

"ఒక్కడే ఒక్కడు! కొండ మీదికి వెళ్ళే మార్గాన్ని కాపలాకాచే గణాచారి అనుచరుడై వుంటాడు," అన్నాడు కోయగోమాంగ్.

"అందుకు సందేహం ఏమీలేదు. కాని, వీడు యిక్కడ వుండగా మనం ముందుకు వెళ్ళటం అసంభవం. వీణ్ణి ఏదో విధంగా యిక్కడ కాళ్ళూ చేతులూ కట్టి పడ వెయ్యాలి," అన్నాడు కేశవుడు.

"అదేపాటి కష్టమయిన పని! నేను ఆ పక్కన వున్న పొదల్లోకి వెళ్ళి కొంచెం అలికిడి చేస్తాను. అదేమిటో చూసేందుకు వాడు బయలుదేరతాడు. మీరు వెనకనుంచి వాణ్ణి పట్టుకుని, అరవకుండా నోరు మూసి, కాళ్ళూ చేతులూ బిగించండి," అంటూ కోయగోమాంగ్ వున్న చోటు నుంచి కదిలి, పిల్లిలా నక్కినక్కి నడుస్తూ పొదల చాటుకు వెళ్ళాడు.

కొద్దిసేపట్లో గోమాంగ్ వెళ్ళిన పొదల వెనక నుంచి చిన్నచిన్న ధ్వనులు బయలుదేరినై. ఆ వెంటనే గణాచారి అనుచరుడు ఈటెను పైకెత్తి, పొదలకేసి నడుస్తూ, "ఏయ్, ఎవరక్కడ? బయిటికి రండి!" అంటూ పెద్దగా కేక పెట్టాడు.

వాడా విధంగా పొదలను సమీపించే లోపల కేశవుడూ, జయమల్లూ నీడల్లా నిశ్శబ్దంగా కదిలి, హఠాత్తుగా వెనక నుంచి వాడి మీద పడ్డారు. కేశవుడు కాపలావాడి చేతులు రెండూ వెనక్కు విరిచి పట్టుకుని,



కాళ్ళను తన కాళ్ళతో మెలివేశాడు. జయమల్లు వాడి నోటిని తన చేత్తో గట్టిగా మూసి, మెడను వెనక్కు వంచాడు. కాని, ఈ లోపల గణాచారి అనుచరుడు కీచు మంటూ పెద్దగా ఒక కేకపెట్టాడు. అ వెంటనే కొండ మీది నుంచి అరుపులు వినబడినై.

"ఇక వీణ్ణి ఆలశ్యం కాకుండా కాళ్ళూ చేతులూ కట్టి, నోట్లో ఆకలములు కుక్కండి. వీడు పెట్టిన కేక, కొండ మీద వున్న వీడి మిత్రులు వినటం ఒక విధంగా మనకు ఉపయోగపడవచ్చు," అన్నాడు జయమల్లు.

క్షణాల మీద జయమల్లు వాళ్ళు తమ పని ముగించుకుని కొండ కేసి చూసేసరికి, అటువేపు నుంచి నలుగురైదుగురు గణాచారి ముఠా వాళ్ళు పరిగెత్తుకు రావటం కనిపించింది.

"ఆ కొండ మీద కాపలావున్న వాళ్ళంతా తమ అనుచరుడి రక్షణకు యిటు పరిగెత్తు కొస్తున్నారు. మనం ఏ ఆటంకం లేకుండా కొండ మీదికి చేరవచ్చు. పరిగెత్తండి!" అంటూ కేశవుడు కొండ కేసి దౌడు తీశాడు.

కేశవుడు ఊహించినట్టు కొండ శిఖరం మీద శత్రువు లెవరూ లేరు. అతడు శిఖరం మీది నుంచి అవలి వైపుకు చూసి నిశ్చేష్టు డయాడు. అతడికి అక్కడ వెడల్పయిన లోయా, వింత వృక్షాలూ, వాటి మీద పిశా

చాల్లా రెక్కలు చాచుకు నిలబడి వున్న గండభేరుండాలూ కనిపించినై.

"ఇదే, రాకాసిలోయ!" అన్నాడు కేశవుడు ఎంతో ఉత్సాహంగా.

"సందేహం లేదు. కాని, యీ శిఖరం మీది నుంచి లోయలోకి ప్రవేశించటం ఎట్లా? నిట్టనిలువుగా వున్న యీ రాళ్ళమీద ఎక్కడా కాస్త కాలు మోపేందుకూడా ఆస్కారం లేదే!" అన్నాడు జయమల్లు నిరాశగా.

"ఇదుగో, యిక్కడేవో అడవి లతల తీగలు వున్నవి. వీటి సాయంతో మనం లోయలోకి దిగవచ్చు," అన్నాడు కోయ గోమాంగ్ ఉత్సాహంగా.

ఆ తీగలు తమ బరువును మోసేంత బలంగా వున్నవో లేవో పరీక్షించేందుకు జయమల్లూ, కేశవుడూ వంగి వాటిని పట్టి చూస్తున్నంతలో, వెనక నుంచి పెద్ద రణగొణ ధ్వని వినబడింది.

"చూడండి, ఆ దుర్మార్గులు యిక్కడే వున్నారు. చుట్టుముట్టి ఈటెలతో పొడవండి!" అంటూ ఒకడు పెద్దగా అరిచాడు. ఆ వెంటనే అయిదారుగురు గణాచారి ముఠావాళ్ళు పెడ బొబ్బలు పెడుతూ శిఖరం పైకి రాసాగారు.

"ఈ అడవి తీగలు పట్టుకుని లోయలోకి దిగటం తప్ప మనకు మార్గాంతరం లేదు. ఊఁ రండి!" అంటూ జయమల్లు బలమైన తీగ నొకదాన్ని పట్టుకుని శిఖరం మీది నుంచి లోయలోకి దిగసాగాడు. కేశవుడూ, గోమాంగ్ అతణ్ణి అనుసరించారు.

"ఆ తీగ ఎక్కడున్నదో చూసి, రాళ్ళతో దాన్ని నజ్జునజ్జు చేయండి! ఆ ముగ్గురు దుర్మార్గులూ కింది లోయలో రాళ్ళ మీద పడి పచ్చడి అయిపోతారు," అని గణాచారి ముఠా వాడొకడు కేకపెట్టాడు. ఆ వెంటనే వాడి అనుచరులు రాళ్ళు తీసుకుని తీగను నరక సాగారు. —(ఇంకా వుంది)



అర్థపాలుడు తన వద్ద ఉన్న పామును తన తండ్రి పై విసిరి వేశాడు. అది కామపాలుణ్ణీ, చండాలుణ్ణీ కరిచి పారి పోతుంటే జనం తొలగి దానికి దారి ఇచ్చారు. ఈలోపునే అర్థపాలుడు చెట్టు దిగి వచ్చి జనంమధ్యగా తన తండ్రిని సమీపించి మంత్రంతో పాము విషాన్ని స్తంభింపజేశాడు. కామపాలుడు మాత్రం పాము కాటుకు చచ్చిపోయిన వాడి లాగా పడి ఉన్నాడు.

"రాజద్రోహిని రాజుగారు శిక్షించకపోతే మాత్రం దేవుడూరుకుంటాడా ఏమిటి? చచ్చే పోయాడు, ఇంక కళ్ళు పీకితే ఏముంది, పీకకపోతే ఏముంది?" అన్నాడు అర్థపాలుడు చుట్టుపక్కల వాళ్ళతో.

ఈ వార్త కాంతిమతికి చేరింది. ఆమెకు తంత్ర మంతా ముందే తెలుసు గనక ఆమె ఆట్టే విచారపడక, తన భర్త ఉన్న చోటికి వచ్చి, అతని తల ఒడిలో పెట్టుకుని కూర్చుని, సహగమనం చెయ్యటానికి అనుమతించవలసిందని తన తమ్ముడికి కబురు చేసింది. ఇందు కతను సమ్మతించాడు.

కామపాలుడి లాగే పాము కాటు తిని చచ్చి పడిపోయిన చండాలుణ్ణి మంత్రవేత్తలు కొందరు బతికించటానికి ప్రయత్నించారు, కాని ఆ ప్రయత్నాలు ఫలించలేదు.



కామపాలుణ్ణి కాంతిమతి తమ ఇంటికి చేర్చి, అతన్ని దర్భచాప పై పడుకోబెట్టి, భర్తతో సహగమనం చెయ్యబోయేటందుకు అవసరమైన విధులన్నీ నిర్వర్తించింది. తరవాత అందరినీ అవతలికి పంపేసి, తన వద్దకు చేరిన అర్థపాలుడితో, "నాయనా, ఇక నీ తండ్రిని బతికించు," అన్నది. అర్థపాలుడి మంత్రంతో కామపాలుడు లేచి కూర్చున్నాడు. అప్పు డర్థపాలుడు తన తండ్రికి తన సంగతి అంతా చెప్పుకుని, "ఇప్పుడిక ఏం చెయ్యాలి?" అని అడిగాడు.

"మన ఇల్లు కోటలాటి రహస్య ప్రదేశం. అందుచేత మనం ఇక్కడ కొంతకాలం

ఇతరులకు తెలియకుండా ఉండవచ్చు. ప్రజలలో నన్నభిమానించే వారూ, నా వల్ల లాభం పొందిన వారూ అనేకులున్నారు. మనకు ఆయుధాల లోటుకూడా లేదు. క్రమంగా ప్రజలను రాజు నుంచి వేరు చేసి నట్టయితే మనం జరిగినదానికి పగ తీర్చుకో వచ్చు," అని కామపాలు డన్నాడు.

కామపాలుడూ, అర్థపాలుడూ ఈ ప్రయత్నంలో ఉండగా, రాజైన సింహఘోషుడికి ఆ విషయం తెలిసిపోయింది. అతను వారిని హతమార్చటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని ఫలించ లేదు.

ఒకనాడు అర్థపాలుడు పూర్ణభద్రుడి ద్వారా రాజమందిరం వివరాలూ, సింహఘోషుడు పడుకునే గది ఎక్కడ ఉన్నదీ తెలుసుకుని, భూమి నుంచి అక్కడికి సొరంగం తవ్వి, నిద్రపోతున్న రాజును పట్టుకుని సంకెళ్ళు వేసి తెచ్చాడు. సింహఘోషుడు తన అక్కనూ, బావనూ చూసి సిగ్గుతో తల వంచుకుని, ఏమీ పలకలేదు. అతనికి వారు కారాగార శిక్ష విధించారు. రాజ్యం కామపాలుడికీ, అతని కొడుకైన అర్థపాలుడికీ సంక్రమించింది.

అర్థపాలుడికి భార్య కూడా లభించింది. కామపాలుడి పెద్ద బావమరిది అయిన చండఘోషుడు క్షయతో చనిపోయేనాటికి అతని భార్య గర్భవతిగా ఉండి, కొంత కాలానికి మణికర్ణిక అనే ఆడపిల్లను కని చనిపోయింది. అప్పటికింకా కాంతిమతి తండ్రి అయిన చండసింహుడు బతికే ఉన్నాడు. కాంతిమతి అనుభవంతో ఆయన తన మనమరాలిని స్వేచ్ఛగా పెరగనివ్వటానికి భయపడి, ఆమె ఎవరి కంటా పడకుండా అంతఃపురంలో రహస్యంగా పెరిగేటట్టు ఏర్పాటు చేశాడు. ఇప్పుడా మణికర్ణిక యుక్తవయస్కురాలై ఉన్నది. తన మేనమామ కుమార్తె అయిన ఆ మణికర్ణికను అర్థపాలుడు పెళ్ళి చేసుకున్నాడు.



ఉన్నాయి. ముఖ్యంగా అతనితో స్నేహంగా ఉంటున్న పూర్ణభద్రుడు ఈ వార్త భరించలేకపోయాడు. కామపాలుడికి శిక్ష జరిగే లోపలనే తాను ఆత్మహత్య చేసుకోవటానికి నిశ్చయించుకుని, అతను నగరం వెలపలికి వెళ్ళాడు. అక్కడ అతని కొక యువకుడు కనిపించి, అతని మనస్థితి గ్రహించి, "మీ బాధకు కారణమేమిటి?" అని అడిగాడు.

ఆ కుర్రవాడు కామపాలుడి కొడుకైన అర్థపాలుడే. అతను మగధరాణి అయిన వసుమతి చేత పెంచబడి, యుక్తవయస్కుడై దేశాటన చేస్తూ ఆ నాడే కాశీ నగరం చేరుకున్నాడు. అతను పూర్ణభద్రుడు చెప్పిన దంతా విని, తన తండ్రి దుస్థితికి కన్నీరు కార్చుతూ, "బాబూ, నేను పరాయి వాణ్ణి కాను. కామపాలుడికీ, కాంతిమతికీ పుట్టి తారావళి ద్వారా వసుమతి వద్ద చేరిన వాణ్ణి నేనే. నా తండ్రిని నేను కాపాడుకుంటాను. అందుకు గాను ఎన్ని వేలమందితోనైనా యుద్ధం చేస్తాను," అన్నాడు.

అతనలా అంటూండగానే పక్కన ఉన్న పుట్టలోనుంచి ఒక పెద్ద తాచు తల బయటికి పెట్టి చూసింది. అర్థపాలుడు మంత్రశక్తితో ఆ తాచును పట్టుకుని పూర్ణభద్రుడితో, "మంచి ఉపాయం దొరికింది. జన





సమ్మర్దంలో చేరి ఈ పామును మా తండ్రి మీద విసురుతాను. అది కరిచి మా తండ్రి పడిపోతాడు. దాని విషాన్ని నా మంత్ర శక్తితో స్తంభింపజేసి, ఆయన ప్రాణాలకు ప్రమాదం లేకుండా చూస్తాను. అందరూ ఆయన చచ్చిపోయాడనుకుంటారు. మీరు మాత్రం మా అమ్మ వద్దకు వెళ్ళి, నేను వచ్చాననీ, ఇలా చెయ్యబోతున్నాననీ చెప్పండి. ఆవిడ తన తమ్ముడి అనుమతితో తన భర్త వెంట సహగమనం చేసే ఏర్పాట్లు చేసుకుని సిద్ధంగా ఉండమనండి. నేను వచ్చి మా తండ్రిని బతికిస్తాను. తరవాత జరగవలసినదంతా ఆయనే నిర్ణయిస్తారు," అన్నాడు.

ఈ మాటలకు పూర్ణభద్రుడు ఎంతో సంతోషించి తిన్నగా కాంతిమతి వద్దకు వెళ్ళి, అర్థపాలుడు చెప్పమన్నదంతా చెప్పేశాడు. అర్థపాలుడు నగరంలోని వధ్యస్థానానికి వెళ్ళి, ఒక దట్టమైన చింతచెట్టెక్కి, పాముతో సహా ఆకుల మాటున కూచుని సమయం కోసం ఎదురు చూస్తున్నాడు.

కామపాలుడికి శిక్ష జరిగే సమయానికి అక్కడ అంతులేని జనం చేరి తలా ఒక రకంగా మాట్లాడుకోసాగారు. కొంతసేపటికి కామపాలుణ్ణి దొంగలాగా పెడరెక్కలు విరిచి కట్టి తెచ్చారు. ఒక చండాలుడు గట్టిగా అరుస్తూ ఇలా ప్రకటించాడు: "వీడు కామపాలుడనే మంత్రి. రాజ్యం అపహరించాలనే దుర్బుద్ధితో రాజైన చండసింహుణ్ణీ, యువరాజైన చండఘోషుణ్ణీ విషం పెట్టి చంపించాడు. ఇప్పుడు సింహఘోష మహారాజును కూడా అలాగే చంపే ప్రయత్నంలో ఉండగా రాజభక్తి గల ఇతర మంత్రులు ఇతని కుట్రను బయటపెట్టారు. ఈ రాజద్రోహికి కళ్ళు పీకివేస్తున్నారు. రాజద్రోహం తలపెట్టే వారందరూ ఇలాటి శిక్షే పొందుతారు."

ఈ ప్రకటన విని జనంలో నుంచి హాహాకారాలు బయలుదేరాయి. ఆ సందడిలో

చండసింహుడికి మంత్రిగా ఉంటూ తన భార్యలైన కాంతిమతితోనూ, తారావళితోనూ సుఖంగా జీవించసాగాడు.

ఒకనాడు ఒక చిత్రం జరిగింది. దాన్ని కామపాలుడు కళ్ళారా చూశాడు. కాశీ నగరంలో పూర్ణభద్రుడనే యువకు డుండే వాడు. వాడు చెడుమార్గానపడి దొంగతనాలు సాగించాడు. వా డొక నా డు దొంగతనానికని ఒక కోమటింట ప్రవేశించి ఇంటి యజమానికి దొరికిపోయాడు. రాజభటులు పూర్ణభద్రుణ్ణి పట్టుకుని తీసుకు వస్తుండగా మృత్యువిజయ మనే మదపుటేనుగు అతని పైకి వచ్చింది. ఉరి శిక్షకు సిద్ధంగా ఉన్న పూర్ణభద్రుడు ఏనుగుకు భయపడక అదిలించాడు. ఏనుగు అతన్ని దంతాలతో పొడవ బోయింది. పూర్ణభద్రుడు కర్రతో దాని మొహాన కొట్టేసరికి ఏనుగు భయపడి వెనక్కు తిరిగింది.

ఇది చూసి మావటి వాడికి కోపం వచ్చి, ఏనుగును అంకుశంతో పొడుస్తూ మళ్ళీ పూర్ణభద్రుడి కేసి మళ్ళించాడు. కాని అది మళ్ళీ దెబ్బతిని పారిపోసాగింది. పూర్ణభద్రుడు దాని వెంటబడి, మావటివాణ్ణి లాగుతూ, "దీన్ని ఎందుకు బాధిస్తావు? ఇంకో ఏనుగును పట్టుకురా!" అన్నాడు.



ఇదంతా చూస్తున్న కామపాలుడు పూర్ణభద్రుణ్ణి పిలిపించి, "మృత్యువిజయాన్నే బెదరగొట్టావే! ఈసారి నీ తప్పు క్షమిస్తాను. ఇకముందు సరిగా నడుచుకో!" అన్నాడు. అది మొదలు వారిద్దరి మధ్యా మంచి స్నేహభావం ఏర్పడింది.

కొంతకాలం గడిచింది. చండసింహుడు చనిపోయాడు. ఆయన పెద్దకొడుకు చండఘోషు డనే వాడు క్షయ వ్యాధితో అంతకు పూర్వమే చనిపోయాడు. రాజ్యార్హత అయి దేళ్ళ వయస్సు గల సింహఘోషుడి పైన పడింది. కామపాలుడు అతనికే పట్టం గట్టి తాను రాజ్యభారం మోస్తూ వచ్చాడు.



కామపాలుడు పేరుకు మంత్రే అయినా, రాజుగారికి బావమరిదీ, పోషకుడూ కావటం రాజోద్యోగులకు కంట కింపయింది. రాజు చిన్నవాడయినందుకు వారి కేమీ లాభం లేకపోయింది. అందుచేత సింహఘోషుడి మనసు విరవటానికి వారతనికి చెప్పుడు మాటలు నూరిపోశారు.

"అమ్మో, కామపాలుడు సామాన్యుడా? మీ అక్కను దొంగతనంగా పెళ్ళాడాడు! అదేమంటే మీ తండ్రిగారిని నిద్రపోతుండగా కత్తితో నరకబోయాడు! అదృష్టవశాన మీ నాన్నగారు సమయానికి మేలుకుని, ఎక్కడ చంపిపోతాడోనని భయపడి, వాళ్ళిద్దరికీ పెళ్ళిచేసేశారు. మీ అన్నకు ఇతనే విషంపెట్టి చంపాడు! మీరింకా చిన్నవారని ఊరుకున్నాడు గాని, మీవల్ల తనకు ప్రమాదం ఉన్నదని తెలిసిన మరుక్షణం చంపేస్తాడు. నలుగురూ చూసి మెచ్చుకోవాలని ప్రస్తుతానికి మీరంటే ఎంతో ఆదరంగా ఉంటున్నాడు," అన్నారు రాజోద్యోగులు.

ఈ మాటలు సింహఘోషుడి తలకెక్కాయి, కాని యక్షిణి అయిన తారావళి శక్తికి భయపడి అతను కామపాలుణ్ణి చంపించే ప్రయత్నం తల పెట్టలేదు. ఇంతలో ఒకనాడు తారావళి కామపాలుడితో ఏదో తగాదా పడి, అతను ఎంత బతిమాలినా వినక, అతన్ని విడిచి వెళ్ళిపోయింది. కామపాలుడు చాలా బాధపడి, లోలోపల కుమిలిపోతూ, ఏదో విధంగా రాచకార్యాలు చూస్తూ వచ్చాడు. ఇదే సమయమనుకుని, అవివేకి అయిన సింహఘోషుడు కామపాలుణ్ణి బంధింపజేసి, అతను రాజద్రోహి అని చాటింపు వేయించి, అతని కన్నులు పీకెయ్యవలసిందిగా ఉత్తరువు చేశాడు.

ఇది ప్రజలలో చాలా మందికి దారుణమనిపించింది. ఎందుకంటే కామపాలుడంటే ప్రజలకు ఎంతో భక్తీ, అభిమానమూ



# అర్థపాలుడు

పుష్పపురానికి మంత్రి అయిన ధర్మపాలుడి చిన్న కొడుకు కామపాలుడనే వాడుండే వాడు. అతను పెద్దవాళ్ళ మాట వినక ఇల్లు విడిచి దేశాటన చేస్తూ కాశీనగరం వచ్చాడు. కాశీరాజైన చండసింహుడికి కాంతిమతి అనే కుమార్తె ఉండేది. ఆమె ఒకనాడు చెలికత్తెలతో కలిసి బంతి ఆట ఆడుతుండగా కామపాలుడామెను చూసి మోహించాడు. అతను ఎంతో ప్రయాసపడి ఆమెకు తన ప్రేమ తెలియజేసి, ఆమెను ఎలాగైతేనేం ఒప్పించి రహస్యంగా గాంధర్వ వివాహం చేసుకున్నాడు. దాని ఫలితంగా కాంతిమతి గర్భవతి అయి, ఒక మగ పిల్లవాణ్ణి కన్నది.

తమ రహస్య వివాహం సంగతి పెద్దవాళ్ళకు తెలియకుండా ఉండగలందులకు కాంతిమతి తాను కన్న బిడ్డను ఒక బోయదాని చేతికిచ్చి, శ్మశానంలో వదిలి రమ్మన్నది. ఆ ముసలి బోయది చంటి బిడ్డను శ్మశానంలో వదిలిపెట్టి తిరిగి వస్తుండగా రాజభటులు అర్ధరాత్రి వేళ దాన్ని పట్టుకున్నారు. ఆ ముసలిది ప్రాణభయంతో రాజకుమార్తె రహస్యాన్ని వారికి చెప్పేసింది. రాజోద్యానంలోని క్రీడాపర్వతం గుహలో పడుకుని నిద్రపోతున్న కామపాలుణ్ణి వారికి పట్టి ఇచ్చింది కూడా. వాళ్ళు అతన్ని పట్టి బంధించి, శిరశ్ఛేదం చెయ్యమని తలారికి అప్పగించారు.

ఈలోపల తారావళి అనే యక్ష కన్య మలయపర్వతం నుంచి అలకాపురానికి పోతూ, కాశీనగర శ్మశానంలో చంటి బిడ్డ ఏడుపు విని, ఆ బిడ్డనెత్తుకుని తన తండ్రికీ, కుబేరుడికీ చూపి, కుబేరుడి ఆజ్ఞపై ఆ బిడ్డను తెచ్చి మగధదేశపు రాణి అయిన వసుమతి వద్ద పెంచటానికి ఇచ్చింది. వెంటనే ఆమె కాశీలోని శ్మశానప్రాంతానికి తిరిగి వచ్చింది.



ఈలోపుగా తలారి కామపాలుణ్ణి శ్మశా నానికి తీసుకుపోయి, అతని తల నరకటానికి కత్తి ఎత్తాడు. అంతలో కామపాలుడు చేతి కట్లు విడిపించుకుని, తలారిచేతి కత్తి చప్పున లాగేసుకుని, దానితోనే ఆ తలారిని చంపేసి, సమీపంలో ఉన్న అరణ్యంలోకి పరిగెత్తి, ఒక చెట్టు కింద కూర్చుని ఉన్న తారావళిని చూశాడు. అత నామెను పలకరించి ఆమె సంగతి అంతా తెలుసుకున్నాడు. తారావళి అతనితో, "మన మిద్దరమూ కిందటి జన్మలో భార్యా భర్తల మని కుబేరుడు చెప్పాడు. ఆయన ఆజ్ఞప్రకారం నీ కొడుకును కాపాడి వసుమతి కిచ్చి వచ్చాను," అన్నది.

ఈ మాట విని కామపాలుడు చాలా సంతోషించి, ఆమె వెంట వెళ్ళి ఆమెను తన భార్యను చేసుకుని, రెండు మూడు రోజులు దివ్యభోగా లనుభవిస్తూ గడిపాడు. తరవాత అతను తారావళితో, "చండ సింహుడు నన్ను చంపించ యత్నించాడు. అందుకు పగ తీర్చుకోవాలని ఉన్నది," అన్నాడు. ఈ మాటకు తారావళి నవ్వి, "అయితే అర్ధ రాత్రివేళ పోదాం. కాంతి మతిని కూడా చూడవచ్చు," అన్నది.

యక్ష మాయ చేత అర్ధరాత్రివేళ కామ పాలుడు చండసింహుడి పడకటింట ప్రవేశిం చాడు. రాజు తల సమీపాన ఉన్న కత్తి తీసుకుని, రాజును నిద్ర లేపి, "నేను నీ అల్లుణ్ణి. నీ అనుమతి లేకుండా నీ కూతు రిని పెళ్ళాడాను. నన్ను చంపమని ఉత్తరు విచ్చావు. ఇప్పుడు నేనే నిన్ను చంపుతాను. ఏమంటావు?" అన్నాడు కామపాలుడు.

చండసింహుడు కామపాలుడి కాళ్ళు పట్టుకుని, "నీ తప్పేమీ లేదు. నేనే బుద్ధి లేక నిన్ను చంపమని ఆజ్ఞ ఇచ్చాను. రేపే మీ ఇద్దరికీ బహిరంగంగా పెళ్ళి చేస్తాను," అన్నాడు. మర్నాడు ఆ ప్రకారమే కాంతి మతికీ, కామపాలుడికీ వైభవంగా పెళ్ళి జరిగిపోయింది. అది మొదలు కామపాలుడు

స్తాను. ఇష్టమైతే అమ్ము. కాకపోతే మరె వరికైనా అమ్ముకోవచ్చు. ఆఖరు మాట చెప్పాను," అన్నాడు రత్నవర్తకుడు. ద్వార పాలకుడు వజ్రాన్ని వర్తకుడి కిచ్చి, పది వేలూ పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

కనీసం పాతికవేలు విలవచేసే వజ్రాన్ని ఎవరు కొంటారా అన్న సమస్య రత్నవర్త కుడికి పట్టుకున్నది. ఆయన దాన్ని తెచ్చి రాజుగారికి అమ్మజూపాడు. రాజుగారు ఆ వజ్రాన్ని తన ఆస్థాన నిపుణులకు చూపించగా, వారు దాన్ని పరీక్షించి, దాని విలువ ముప్పైవేల దాకా ఉండవచ్చు నన్నారు. రాజు ఆ వజ్రాన్ని ఒక పరీక్షకు పెట్ట గలందులకు తన అభ్యంతర గృహంలోకి వెళ్ళాడు. అక్కడ ఒక దేవీ విగ్రహం ఉన్నది. రాజుగారు ఏదైనా విలువైన వస్తు వులు కొనవలసి వచ్చినప్పుడు ఆ దేవి అభి ప్రాయాన్ని అర్థించేవాడు. ఆ దేవి తన యిష్టానిష్టాలను ఏదో ఒక సంజ్ఞ ద్వారా తెలియజేస్తూ ఉండేది.

ఇప్పుడు కూడా రాజు అదే విధంగా ఈ వజ్రాన్ని దేవి వద్దకు తీసుకు పోయి, దాన్ని దేవి చేతిపైన ఉంచి, కళ్ళు మూసు కుని ధ్యానించాడు. వెంటనే వజ్రం కింద పడిన చప్పుడు వినిపించింది. రాజు మరి



రెండుసార్లు వజ్రాన్ని దేవి చేతిపై ఉంచి, ధ్యానించాడు. కాని రెండుసార్లూ అది కింద పడింది. రాజు వజ్రాన్ని తీసుకుని రత్న వర్తకుడివద్దకు తిరిగి వచ్చి, "ఇది మంచి వజ్రమే నని నిపుణులు చెబుతున్నారు. అయితే దీని విక్రయంలో ఏదో అన్యాయం ఉన్నది. ఇది నీ కెలా వచ్చిందో ఎంతకు కొన్నావో నిజం చెప్పు," అన్నాడు.

"మహారాజా, నిజం దాచాలన్న తలంపు నాకే కోశానా లేదు. నేను దీన్ని పదివేలిచ్చి కొన్నాను. దీని విలువ అంతకంటె ఎక్కువే. కాని మారుబేరానికి అమ్మేవాణ్ణి కనుక నేను కొనే చోట పూర్తి విలువ ఇవ్వటం సాధ్యం

కాదు. తక్కువకు కొని ఎక్కువకు అమ్మటమే నా వృత్తి. అందులో అన్యాయం ఏమీ లేదు," అన్నాడు రత్నవర్తకుడు.

"దీన్ని నీకు అమ్మినవా డెవరు?" అని రాజు అడిగాడు.

"తమ రాజప్రాసాద ద్వారరక్షకుడు," అని రత్నవర్తకుడు చెప్పాడు.

రాజు ద్వారపాలకుణ్ణి పిలిపించి, "నీవీ రత్న వర్తకుడికి ఈ వజ్రాన్ని అమ్మావట. ఇది నీ కెలా లభించింది?" అని అడిగాడు.

"మహారాజా, మన్నించాలి. ఒక పల్లెవాడు దీన్ని నా వద్దకు తెచ్చి ఇచ్చి, ఒక ధేవతుల చాపు పుచ్చుకుని వెళ్ళాడు," అన్నాడు ద్వారపాలకుడు.

"ఎవరా పల్లెవాడు? వాడి పేరేమిటి?" అని రాజు మళ్ళీ అడిగాడు.

ద్వారపాలకుడు తనకు తెలియదన్నాడు. రాజుగారు మర్నాడు పల్లెవాళ్ళందరూ హాజరు కావలిసిందని చాటింపు వేయించాడు. పల్లెవాళ్ళంతా వచ్చారు. వారుండే చోటికి రాజు మంత్రినీ, రత్నవర్తకుణ్ణీ, ద్వారపాలకుణ్ణీ వెంటబెట్టుకుని వచ్చాడు.

ద్వారపాలకుడూ, పల్లెవాడూ ఒకరినొకరు గుర్తుపట్టారు.

రాజుగారి తరఫున మంత్రి పల్లెవాణ్ణి వజ్రం గురించి అడిగి తెలుసుకున్నాడు. పల్లెవాడు జరిగినదంతా చెప్పి, ఇంటికి వెళ్ళి ఉప్పులో ఉంచిన చేప ఖండాలను తెచ్చి, వజ్రం ఉండిన చోట ఆనమాలు కూడా చూపాడు.

రాజు వెంటనే విచారణ జరిపి ద్వారపాలకుడికి కారాగృహ శిక్ష విధించి, రత్న వర్తకుడికి నష్టం కలగకుండా పదివేలు ఇప్పించి, వజ్రం విలువ పాతికవేలూ న్యాయంగా పల్లెవాడికి ఇప్పించాడు. ఇంత తతంగం జరిగాక పల్లెవాడి కోరిక సిద్ధించింది. వాడా ధనం పెట్టుకుని తన భార్యతో హాయిగా జీవించాడు.





# న్యాయమైన విలువ

ఒకప్పు డొక గ్రామంలో ఒక పల్లెవాడుండే వాడు. ఒకనాడు వాడికి వలలో ఒకే ఒక చేప దొరికింది. పల్లెవాడు ఇంటికి వెళ్ళి, ఆ చేపను తన భార్య కిచ్చి వండమన్నాడు.

వాడి భార్య చేపను చీల్చే సరికి దాని పొట్టలో నుంచి గోలికాయ ప్రమాణం గల వజ్రం బయటికి వచ్చింది.

"ఈ చేపను వండకు. అలాగే ఉప్పులో ఉంచు. నేను వజ్రాన్ని నగరులో అమ్మి వేలకు వేలు తెస్తాను. తరవాత మనం సుఖంగా ఉండవచ్చు," అని భార్యతో చెప్పి, పల్లెవాడు నగరానికి బయలుదేరాడు.

కాని దారిలో వాడి కొక సందేహం వచ్చింది. వజ్రాన్ని అమ్మటం తేలిక పని కాదు. రత్నవర్తకులు దాని విలువ ఇయ్యరు. తాను పేచీ పెట్టితే రాజభటులకు అప్పగిస్తారు. తనకు వేలకువేలు రావు సరి కదా, కారాగృహ ప్రాప్తికూడా కలగవచ్చు.

అందుచేత పల్లెవాడు ఆ వజ్రాన్ని తీసుకు పోయి కానుకగా ఇచ్చి, రాజుగారు ఏమి బహుమతి ఇస్తే అది పుచ్చుకుందా మనుకున్నాడు.

ఈ నిశ్చయంతో వాడు ఏకంగా రాజ భవనానికే వెళ్ళాడు. వాణ్ణి ద్వారపాలకుడు ఆపి, లోపలికి వెళ్ళనివ్వక, "నీకు రాజ భవనంలో ఏం పని?" అని అడిగాడు.

"రాజుగారి దర్శనం చేసుకోవాలి," అన్నాడు పల్లెవాడు.

ద్వారపాలకుడు విరగబడి పెద్దగా నవ్వి, "మహారాజుగారు ఈ మొహానికి దర్శన మివ్వకేం?" అన్నాడు.

పల్లెవాడికి ఆవేదన పుట్టుకొచ్చింది. "నేను ఎలాగైనా రాజుగారిని చూసి తీరాలి. నేను వారినేమీ కోరను. ఒక వస్తువు వారికి అందజేసి నా దోవన నేను పోతాను," అన్నాడు వాడు ఆదుర్దాగా.

ఎల్. రమణయ్య



వాడి పని ఏమిటో తెలుసుకోవాలని ద్వార పాలకుడికి ఆసక్తి పుట్టుకొచ్చింది. వాడు పల్లెవాడితో, "చూడు, తమ్ముడూ, నిన్ను లోపలికి పోనిచ్చానో నన్ను ఉరితీసేస్తారు. రాజుగారికి నీ వీయదలచిన దేమిటో నాకిస్తే, నేను తిన్నగా రాజుగారి కిచ్చేస్తాను. నీవు తెచ్చిన వస్తువు ఏమిటో చూపించు," అన్నాడు. గత్యంతరం లేక పల్లెవాడు వజ్రాన్ని ద్వారపాలకుడికి చూపాడు. ద్వారపాలకుడు ద్వార రక్షణకు మరొక భటుణ్ణి తన స్థానంలో నియమించి, వెళ్ళిపోయాడు.

వాడు కొంత సేపటికి ధోవతుల చాపుతో తిరిగి వచ్చి, "నీ వజ్రాన్ని రాజుగారి కిచ్చాను. వారు నీకీ బట్టలు బహుమతి ఇచ్చి పంపమన్నారు," అని చెప్పాడు.

పల్లెవాడికి గుండె జారిపోయింది. "రాజుగా రిచ్చిన బహుమానం ఇంతేనా? ఇంకేమీ ఇయ్యలేదా?" అని వాడడిగాడు.

"నీ విచ్చిన గాజుపూసకు బట్టలు పెట్టి పంపక అర్ధరాజ్యం ఇస్తారనుకున్నావా? పద, పద!" అని ద్వారపాలకుడు పల్లెవాణ్ణి అదిలించాడు. పల్లెవా డొక్క నిట్టూర్పు విడిచి, ఇంటి దారి పట్టాడు.

ఇంతకూ ద్వారపాలకు డా వజ్రాన్ని రాజుగారి కివ్వలేదు. వాడు మర్నాడు గొప్ప రత్నవర్తకుడి వద్దకు వెళ్ళి, పల్లెవా డిచ్చిన వజ్రాన్ని చూపి, "కొంటారా? ఎంతకు కొంటారు?" అని అడిగాడు.

రత్నవర్తకు డా వజ్రాన్ని పరీక్షించి, అది అపూర్వమైనదీ, విలువగలదీ అని గ్రహించి, "ఇది నీ కెలా వచ్చింది?" అని ద్వార పాలకుణ్ణి అడిగాడు.

"మా బంధు వొకాయన సముద్ర వ్యాపారం చేస్తాడు. ఆయన పాత బాకీ కింద నాకీ వజ్రాన్ని పంపాడు," అని ద్వార పాలకు డన్నాడు.

రత్నవర్తకుడు అయిదు వేలిస్తానన్నాడు. ద్వారపాలకుడు బేరం చేశాడు. "పదివేలి



నృత్యాలు చేసేటట్టుగా చేసే వేణువు కావాలి," అన్నాడు.

"ఈసారి అంత కన్న మంచి వరం కోరుకో," అన్నాడు బిచ్చగాడు.

"ఎంత దూరాన ఉండే వస్తువునైనా గురిగా కొట్టగల ఉండేలుబద్ద కావాలి," అన్నాడు ఆనందుడు.

"ఇటువంటివి కోరుతున్నా వేమిటి? నిజంగా పనికివచ్చే కోరిక కోరుకో. ఇంకొక్క వరమే ఉన్నది," అన్నాడు బిచ్చగాడు.

"నేను ఎవరిని ఏది అడిగినా వెంటనే వాళ్ళు నా కది ఇవ్వాలి. ఇంతవరకు నా జీవితంలో అట్లా జరగలేదు." అన్నాడు ఆనందుడు.

"ఈసారి కాస్త మంచి కోరికే కోరావు. నీ మూడు కోరికలూ తీరుతాయిలే," అంటూ బిచ్చగాడు వెళ్ళిపోయాడు.

ఆనందుడు కొండల్లోనే ఒకచోట ఎండ వేళ పడుకుని నిద్రలేచే సరికి, వాడి పక్కన ఒక వేణువూ, ఒక ఉండేలు బద్దా పెట్టి ఉన్నాయి. వాడు సంతోషంగా వాటిని తీసుకుని బస్తీకి చేరుకున్నాడు. బస్తీలో వాడు దుకాణాల వద్దకు వెళ్ళి తనకు కావలిసిన దుస్తులడిగి తీసుకున్నాడు. ఎవరినో అడిగి గుర్రం తీసుకున్నాడు. వాడు




అడిగితే చాలు, పరమలోభులు కూడా అడిగిన దాన్ని కాదనకుండా ఇచ్చేశారు. వాడు గుర్రమెక్కి తన గ్రామానికి తిరిగివచ్చాడు.

అక్కడ వాడికి గ్రామాధికారి కనిపించాడు. ఆనందుడు గుర్రాన్ని ఆపి, "దండాలు, బాబుగారూ!" అన్నాడు.

గ్రామాధికారి వాణ్ణి చూసి నిర్ఘాంతపోయి, "అరె, ఇంతలోనే పెద్దమనిషివై పోయావే!" అన్నాడు.

"అంతా కలిసి వచ్చింది లెండి," అన్నాడు ఆనందుడు.

"చేతిలో వేణువు కూడా పట్టావే? పని మానేసి సంగీత విద్వాంసుడ వవుతావా

ఏమిటి ?" అని గ్రామాధికారి అడిగాడు వెటకారంగా.

"దానికేముంది లెండి ? ఈ వేణువు కన్న గొప్పది ఈ ఉండేలుబద్ద. దీనితో ఎంత దూరాన ఉన్నదాన్నయినా కొట్ట గలను. దూరాన ఆ తాటిచెట్టు మీద కూర్చున్న పక్షిని కూడా కొట్టగలను," అన్నాడు ఆనందుడు.

"నీ మొహం!" అన్నాడు గ్రామాధికారి.

"పందెం వెయ్యండి, చూద్దురు గాని," అన్నాడు ఆనందుడు.

"నీవా పక్షిని కొట్టితే నా పాల మంతా ఇస్తాను. నా దగ్గిర ఉండే నగ దంతా ఇస్తాను. మళ్ళీ మాట్లాడితే ఆ పక్షిని నేనే స్వయంగా తీసుకొచ్చి నీ కిస్తాను. నీవు పక్షిని కొట్టినప్పటి మాట గద," అన్నాడు గ్రామాధికారి.

ఆనందుడు ఉండేలు బద్దతో తాటిచెట్టు మీద ఉన్న పక్షిని పడగొట్టాడు. అది తాటి చెట్టు చుట్టూ ఉన్న రక్కస పొదలలో పడింది. గ్రామాధికారి ఆ పక్షిని తీసుకు రావటానికి రక్కస పొదలలోకి వెళ్ళవలసి వచ్చింది. ఆయన ముళ్ళు గీసుకుంటూ ఆ పొదలలోకి వెళ్ళి పక్షిని తీసుకోగానే ఆనందుడు వేణువు ఊదాడు. వెంటనే గ్రామాధికారి నృత్యం చేయసాగాడు.

కొద్దిసేపట్లోనే గ్రామాధికారి ఒళ్ళంతా గీరుకుపోయింది. బట్టలన్నీ చీలి, వాలిక లయాయి. ఆనందుడు వేణువు ఊదటం మానేసి, పొదలలోనుంచి బయటికి వచ్చిన గ్రామాధికారిని చూసి, "నేను తమ కొలువు చాలించు కున్నప్పుడు నా బట్టలూ ఇట్లాగే ఉన్నాయి," అన్నాడు.

గ్రామాధికారి పందెంలో ఓడిపోయాడు గనక ఆనందుడికి తన వద్ద ఉన్న నగ దంతా ఇవ్వవలిసి వచ్చింది. ఆ డబ్బు తీసుకుని ఆనందుడు బస్తీకి వెళ్ళి అక్కడ సరదాగా కాలక్షేపం చేశాడు.





# వింత వేణువు

ఒక పేదవాడి కొక్కడే కొడుకుండేవాడు. వాడు అతిదుర్బలుడు, పని చెయ్యటానికి బొత్తిగా పనికిరాడు. వాడి పేరు ఆనందుడు. తండ్రి ఆనందుణ్ణి చాలాకాలం తన రెక్కల కష్టంతోనే పోషిస్తూ వచ్చాడు. కాని రాను రాను గంజికి కూడా కరువైపోయింది. అందుచేత తండ్రి ఆనందుణ్ణి ఎక్కడైనా పనికి కుదుర్చుదా మనుకుని, వాణ్ణి వెంట బెట్టుకుని బయలుదేరాడు.

అయితే ఆనందుణ్ణి పనిలోకి తీసుకోవటానికి ఎవరూ ఒప్పుకోలేదు. చివరకు ఆనందుణ్ణి వాడి తండ్రి గ్రామాధికారి వద్దకు తీసుకు పోయాడు. గ్రామాధికారి వాణ్ణి పనిలోకి తీసుకున్నాడు. నిజానికి గ్రామాధికారి వట్టి కర్కోటకుడు. ఆయన వద్దకు పని వాళ్ళెవరూ వచ్చేవారుకారు, వచ్చినా నిలిచే వారుకారు. ఏమీలేనిదాని కన్న గ్రామాధికారి కొలువే నయం గదా అనుకుని, ఆనందుణ్ణి వాడి తండ్రి ఆయన వద్ద పనికి పెట్టాడు. ఇంకేమీ లేకపోతే వాడి కింత తిండి అయినా దొరుకుతుంది. జీతమూ, బట్టలూ మొదలైన విషయాలను గురించి ఏమీ చెప్పకుండానే గ్రామాధికారి ఆనందుణ్ణి పనిలో పెట్టుకున్నాడు.

మూడేళ్ళు పనిచేసినాక ఆనందుడు వెళ్ళిపోతానన్నాడు. గ్రామాధికారి వాడి చేతిలో మూడు వెండి రూకలుపెట్టి, "ఏడాదికి రూక చొప్పున ఇచ్చాను, ఇక నీ దారిన నువు వెళ్ళు," అన్నాడు.

"మూడేళ్ళనాడు ఏ బట్టలతో వచ్చానో, వాటితోనే పంపిస్తారా?" అని ఆనందుడడిగాడు.

"బట్టలిచ్చేటట్టు ముందుగా అనుకోలేదు. డబ్బిచ్చినదే ఎంతో ఎక్కువ," అన్నాడు గ్రామాధికారి. ఆనందుడు ఆ మూడు రూకలూ తీసుకుని బస్తీకి బయలుదేరాడు.

ఎస్. ప్రసాదరావు



బస్తీకి వెళ్ళాలంటే కొండల మధ్య గల కనుమలో నుంచి వెళ్ళాలి. వాడికి ఆ కనుమలో ఒక బిచ్చగాడు అకస్మాత్తుగా ఎదురయాడు. ఆ బిచ్చగా డెంత ఎత్తుగా ఉన్నాడంటే వాణ్ణి చూసి భయపడి, ఆనందుడు కెవ్వున కేకపెట్టాడు.

"నిన్నేమీ చెయ్యను. నా కొక్క రూక యియ్యి చాలు," అన్నాడు బిచ్చగాడు.

"నా దగ్గిర ఉన్నవే మూడు రూకలు. వీటితో బట్టలు కొనుక్కోవాలి," అన్నాడు ఆనందుడు.

"మూడు రూకలున్నాయి గదా, నీవు రెండుంచుకుని నాకు ఒక్కటియ్యి. చూడు, నా బట్టలు నీ బట్టల కన్నా అన్యాయంగా ఉన్నాయి," అన్నాడు బిచ్చగాడు.

ఆనందుడు బిచ్చగాడి కొక రూక యిచ్చి ముందుకు సాగాడు. కొంతదూరం పోయాక మరొక కనుమ మలుపులో వాడికి మరొక బిచ్చగాడు ఎదురయాడు. వీడు మొదటి బిచ్చగాడి కన్న కూడా చాలా ఎత్తున్నాడు. ఈ బిచ్చగాడు కూడా మొదటివాడు లాగానే ఆనందుడి వద్ద నుంచి ఒక రూక పుచ్చుకున్నాడు. కనుమ చివరలో ఆనందుడికి మూడో బిచ్చగాడు తగిలాడు. వాడు మిగిలిన ఇద్దరికన్నా చాలా ఎత్తున్నాడు. ఆనందుడి దగ్గిర మిగిలి ఉన్న రూక ఇచ్చేసిన దాకా వాడు వదలలేదు. బిచ్చగాడి దీనస్థితి చూసి ఆనందుడు మూడో రూక కాస్తా వాడి చేతిలో పెట్టేశాడు.

అది తీసుకున్న బిచ్చగాడు వెంటనే వెళ్ళిపోక, "నీ దగ్గిర ఉండే మూడు రూకలూ బిచ్చగాళ్ళ కిచ్చేశావు. రూక కొక వరం చొప్పున కోరుకో. అన్నిటి కన్న నీ కేమిష్టమో చెప్పు," అన్నాడు.

ఆనందుడు కొంచెం ఆలోచించి, "కృష్ణుడు వేణువు ఊదుతూంటే గోప కులూ, గోపికలూ నృత్యాలు చేసి మైమరచే వారుట. అట్లా వినే వారిని మైమరపించి

# పనికిరాని సాధనం

ఒక కుందేలు ఒక కొక్కిరాయి వద్దకు వచ్చి, "నీవు కట్టుడుపళ్ళు బాగా కడతావుట. నాకు రెండు మంచి దంతాలు కట్టు," అన్నది.

"నీ పళ్ళన్నీ బాగానే ఉన్నాయే," అన్నది కొక్కిరాయి.

"బాగా లేవని కాదు. నాకు ఇంకా పొడుగైన కోరలు—సింహం కోరల్లాంటివి—కావాలి," అన్నది కుందేలు.

"దేనికి ?" అని కొక్కిరాయి అడిగింది.

"నక్కను భయపెట్టటానికి. దానితో వేగ లేకుండా ఉన్నాను. దాన్ని చూసినప్పుడల్లా పారిపోవలిసి వస్తున్నది. ఈ దెబ్బతో అదే నన్ను చూసి పారిపోవాలి," అన్నది కుందేలు. కొక్కిరాయి తనలోనే నవ్వుకుని కుందేలుకు రెండు భయంకరమైన కోరలు అమర్చింది.

కుందేలు అద్దంలో చూసుకుని, "అద్భుతం! ఇప్పుడు చెబుతాను నక్క పని!" అని నక్కను వెతుకుతూ బయలుదేరింది. అది ఎంతో దూరం పోకుండానే ఒక పొద చాటున పొంచి చూస్తున్న నక్క కనిపించింది.

కుందేలు అదురుకుని, శరవేగంతో కొక్కిరాయి వద్దకు తిరిగి వచ్చి, "అన్నా, ఈ కోరలు తీసేసి, ఇంత కన్న భయంకరంగా ఉండే దేమైనా అమర్చ గలవా ?" అని అడిగింది.

"మార్చవలిసినది నీ దంతాలు కావు, నీ పిరికి గుండె! దాన్ని తీసేసి గట్టి గుండె అమర్చినప్పుడు గాని, నీ సమస్య తీరదు," అన్నది కొక్కిరాయి.






# విచిత్రమైన కోరిక

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీది నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీ ఆశయ మేమిటో ఎంత ఆలోచించినా అర్థం కావటం లేదు. నిన్ను చూస్తుంటే నాకు ఖాండిక్యుడు జ్ఞాపకం వస్తున్నాడు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు అతని కథ చెబుతాను విను,'' అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

జనక మహారాజు వంశంలో అమిత ధ్వజు డనే రాజుకు కృతధ్వజు డనీ, ఖాండిక్యుడనీ ఇద్దరు కొడుకులు. వారు తమ తండ్రి రాజ్యాన్ని పంచుకుని రాజ్య పాలన చేస్తూ ఉండేవారు. కృతధ్వజుడికి కేశిధ్వజు డనే కొడుకుండే వాడు. అతను రాజ్యానికి వచ్చి, ఖాండిక్యుడి రాజ్యాన్ని కూడా లాగేసుకున్నాడు. రాజ్యభ్రష్టుడైన

**బేతాళ కథలు**

ఖాండిక్యుడు తన మంత్రి పురోహితాదులను కొద్దిమందిని వెంట బెట్టుకుని అరణ్యాలకు వెళ్ళిపోయి అక్కడ ఉంటూ వచ్చాడు.

కేశిధ్వజుడు యోగవిద్య తెలిసినవాడు. అతను అనేక యజ్ఞాలు చేశాడు. ఒకనాడతను యోగసమాధిలో ఉండగా అతని యజ్ఞధేనువును పులి తిని వేసింది. ఇలా జరిగినందుకు ప్రాయశ్చిత్త మేమిటని అతను యజ్ఞం చేయించే ఋత్విక్కుల నడిగాడు.

"ఈ ధర్మ సందేహానికి మేము సమాధానం చెప్పలేము. కశేరువు అనే ముని నడిగితే ఆయన చెప్పగలుగుతాడు," అన్నారు ఋత్విక్కులు.

రాజు అలాగే కశేరు మహాముని వద్దకు వెళ్ళి, "స్వామీ నా యజ్ఞధేనువును పులి తిన్నది. ఇందుకేం ప్రాయశ్చిత్తం చెయ్యాలంటారు?" అని అడిగాడు.

"ఈ విషయం నాకు ఏమీ తెలీదు. శునకు డనే ముని ఉన్నాడు. అతనైతే నీవు చెయ్యవలిసిన ప్రాయశ్చిత్తం ఏమిటో చెబుతాడు," అన్నాడు కశేరు మహాముని.

కేశిధ్వజుడు శునక మహాముని వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పి, తాను చేయవలసిన ప్రాయశ్చిత్తం ఏమిటని అడిగాడు. దానికి శునకుడు, "ఓ రాజా, నీ ధర్మ



సందేహం తీర్చ గల శక్తి నాకూ లేదు. కశేరువుకూ లేదు. అలాటి శక్తి గలవాడు ప్రపంచంలో ఒక్కడే ఉన్నాడు. అతను ఖాండిక్యుడు." అని చెప్పాడు.

కేశిధ్వజుడికి పెద్ద సమస్య ఏర్పడింది: తన చేత ఓడి రాజ్యభ్రష్టుడైన వాడి వద్దకు తాను ఎలా వెళ్ళటం? ఎలా సలహా అడగటం? అడిగితే మాత్రం అతను చెబుతాడా? ఇలాటి ప్రశ్నలతో కొంతసేపు సతమతమై, కేశిధ్వజుడు ఖాండిక్యుడి వద్దకు వెళ్ళటానికే నిశ్చయించుకున్నాడు. "నన్ను చూడగానే ఖాండిక్యుడు శత్రుభావంతో చంపినట్టయితే, యజ్ఞదీక్షలో ఉండి చచ్చి



పోతాను గనక నాకు యజ్ఞ ఫలం పూర్తిగా లభిస్తుంది. అలా కాక, అతను నా సందేహం తీర్చి పంపిస్తాడా, యజ్ఞం నిర్విఘ్నంగా కొనసాగి అలా కూడా నాకు యజ్ఞ ఫలం దక్కుతుంది. అందుచేత అతని వద్దకు వెళ్ళటం వల్ల నా కేమీ నష్టం ఉండదు," అని కేశిధ్వజు డనుకున్నాడు.

అతను తన రథ మెక్కి అరణ్యంలో ఖాండిక్యు డుండే చోటికి బయలుదేరి వెళ్ళాడు. ఖాండిక్యుడికి అతన్ని చూడగానే పట్టరాని కోపం వచ్చింది. అతను తన బాణాన్ని ఎక్కుపెట్టి, "ఓరీ, కృష్ణాజినం ధరించినా నీ పాపిష్టి బుద్ధి మారలేదు. నన్ను చంపటానికి ఇక్కడికి కూడా వచ్చావా? పై పెచ్చు దొంగ వేషం వేశావా? నీవు నిజంగానే లేడి తోలు కప్పుకున్న పులివి గదరా! అనవసరంగా ఒక సారి నాతో యుద్ధం పెట్టుకుని నా రాజ్యం అపహరించావు. అంతటితో తృప్తి లేక నా ప్రాణాలు తీయటానికి మళ్ళీ వచ్చావు. నా రాజ్యాన్ని హరించిన వాణ్ణి నేనెందుకు చంపగూడదూ? ఇప్పుడే నిన్ను సంహరిస్తాను," అన్నాడు.

ఈ మాట విని కేశిధ్వజుడు ఖాండిక్యుడికి నమస్కారం చేసి, "బాబూ, నేను నిన్ను చంపటానికి రాలేదు, ఒక ధర్మసందేహం తీర్చుకోవటానికి వచ్చాను. నా సందేహమే తీర్చుతారో, బాణంతో కొట్టి చంపుతారో మీరే తేల్చుకోండి. నేను రెంటికీ సిద్ధంగానే ఉన్నాను," అన్నాడు.

కేశిధ్వజు డిలా అనే సరికి ఖాండిక్యుడు రహస్యంగా మంత్రి పురోహితులను సమావేశం చేసి వారి సలహా కోరాడు. "వీడు నీకు ప్రబల శత్రువు. వీణ్ణి చంపేసినట్టయితే నీవు నిరాటంకంగా దేశమంతా ఏలుకోవచ్చు," అని వారు సలహా ఇచ్చారు.

కాని ఈ సలహా ఖాండిక్యుడికి నచ్చలేదు. "యజ్ఞదీక్ష పూని ఉన్న వీణ్ణి నే నిప్పుడు చంపినట్టయితే వీడు శాశ్వతంగా

పరలోక సుఖాలన్నీ అనుభవిస్తాడు. బతికి ఉండనిస్తే వీడికి ఇహలోక సుఖాలు తప్ప మరేమీ ఉండవు. అందుచేత వీణ్ణి చంపను," అన్నా డతను.

అతను కేశిధ్వజుడి వద్దకు తిరిగివచ్చి, "నీవేదో ధర్మసందేహంతో వచ్చానంటివే, ఏమిటది? అడుగు, చెబుతాను," అన్నాడు. కేశిధ్వజుడు తాను ఆచరించవలిసిన ప్రాయశ్చిత్త విధి ఏమిటని అడిగాడు. ఖాండిక్యుడు అతను కోరిన ప్రాయశ్చిత్త విధి తెలిపి పంపేశాడు.

కేశిధ్వజుడు తన స్వస్థలానికి తిరిగివచ్చి, ప్రాయశ్చిత్తం చేసుకుని, యజ్ఞం జయప్రదంగా పూర్తిచేసి, ఋత్విజులను పూజించి, సదస్యులను యథావిధి సన్మానించాడు. కాని తాను ఖాండిక్యుడికి గురుదక్షిణ ఇవ్వలేదన్న బాధ కేశిధ్వజుడికి పట్టుకున్నది. అందుచేత అతను రథమెక్కి మళ్ళీ ఖాండిక్యుడి వద్దకు బయలుదేరి వెళ్ళాడు. అతను మళ్ళీ వస్తూ ఉండటం చూసి ఖాండిక్యుడు ఆయుధాలు చేతబట్టి, యుద్ధసన్నద్ధుడై నిలబడ్డాడు.

"బాబూ, నేను యుద్ధం చెయ్యటానికి రాలేదు. గురుదక్షిణ సమర్పించుకుందామని వచ్చాను. మీ దయ వల్ల నా యాగం



పూర్తి అయింది. గురుదక్షిణగా ఏమి కావాలో కోరండి," అన్నాడు కేశిధ్వజుడు.

ఖాండిక్యుడు మళ్ళీ మంత్రి పురోహితులతో ఏకాంతాలోచన చేశాడు. "వీడు మనకు బాగా చిక్కాడు. సంకోచించకుండా రాజ్యం అడిగి పుచ్చుకోండి. యుద్ధం అవసరం లేకుండా, పోయిన రాజ్యం తిరిగి సంపాదించుకోవటాని కింతకంటె మంచి అవకాశం మళ్ళీ దొరకదు," అని మంత్రి పురోహితులు సలహా ఇచ్చారు.

ఖాండిక్యుడు వారి సలహా విని నవ్వి, కేశిధ్వజుడి వద్దకు వెళ్ళి, "నాకు నీ నుంచి మరేదీ అవసరం లేదు గాని నీకు తెలిసిన

యోగ విద్య నాకు చెప్పి, నీ దారిన నీవు వెళ్ళు," అన్నాడు.

ఈ కోరిక విని కేశిధ్వజుడు కూడా ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే, అతను కూడా ఖాండిక్యుడు రాజ్యం ఇవ్వమంటాడనే అనుకున్నాడు. అతను ఖాండిక్యుడికి గురుదక్షిణ కింద తన యోగ విద్య ఇచ్చి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా నా కొక సందేహం. ఖాండిక్యుడు మంత్రి పురోహితులు సలహా చెప్పిన మీదట కూడా తన విరోధి నుంచి రాజ్యం ఎందుకు కోరలేదు? వారి సలహా విని ఎందుకు నవ్వాడు? అతనికి రాజ్యం మీద ఇష్టం లేకనా? లేక కేశిధ్వజుడి పట్ల శత్రుభావం లేకనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఖాండిక్యుడు సుక్షత్రియుడు. అందుచేత అతనికి రాజ్యకాంక్ష పోవటమంటూ ఉండదు. తన రాజ్యం అపహరించిన వాణ్ణి మిత్రుడుగా చూడటమంటూ కూడా ఉండదు. అతను సుక్షత్రియుడు కనకనే తన శత్రువును రాజ్యం అడగలేదు. రాజ్యం భుజ బలంతో గెలిచేదే గాని, యాచించి దానం పుచ్చుకునేది కాదు. తనకు రాజ్యాన్ని నిలబెట్టుకునే శక్తి చాలనందుచేతనే కేశిధ్వజుడు అతని రాజ్యాన్ని లాక్కున్నాడు. దాన్ని గురు దక్షిణగా స్వీకరించినా, రేపు ఆ కేశిధ్వజుడే మళ్ళీ తనను జయించి ఆ రాజ్యాన్ని కాజేయవచ్చు. ఈ సంగతి మంత్రి పురోహితులకు తట్టలేదు, యాచన క్షత్రియ ధర్మం కాదని కూడా వారు ఆలోచించలేదు. అందుకే వారి సలహా అతను విని నవ్వాడు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# ఖలీఫాల సంపద

## 2

ఆ రోజు మొదలు తుఫ్‌హా ఖలీఫా హృదయ రాణి అయింది. ఆయన ఆమెను విడిచి ఒక్క క్షణం అవతలికి వెళ్ళవలిసి వచ్చినా చాలా బాధ పడేవాడు. తెలివి తేటలు గలది కావటంచేత రాచకార్యాలన్నిటిలోనూ ఆమె సలహా పొందేవాడు. అయన ఆమెకు యాభైమంది దాసీలనూ, నెలకు రెండు లక్షల దీనారాల భరణాన్నీ ఏర్పాటు చేసినది కాక, అస్తమానమూ ఏవో కానుక లిస్తూండేవాడు.

ఆయన ప్రేమ ఎంతదాకా ముదిరిందంటే అమెను రక్షించే పని మరొకరికి ఇవ్వక, తన పైనే వేసుకున్నాడు. ఆమె గదికి తానే స్వయంగా తాళం వేసి, తాళపు చెవి వెంటబెట్టుకు పోయేవాడు. ఏ కారణం చేతగాని ఆమె కంట నీరు పెట్టుకుంటే ఖలీఫా ప్రాణం విలవిలలాడేది.

ఒకనాడు ఖలీఫా వేటకు వెళ్ళాడు. తుఫ్‌హా తన గదిలో ఏదో పుస్తకం చదువుతూ కూర్చుని ఉండగా, ఖలీఫా పట్టమహిషి అయిన జుబేదా రాణి అక్కడికి వచ్చింది. ఆమెను చూడగానే తుఫ్‌హా చివాలున లేచి, "మహారాణిగారు నన్ను క్షమించాలి. నాకు కదిలే స్వేచ్ఛే ఉన్నట్టయితే రోజూ వచ్చి తమకు పరిచర్యలు చేసుకుని ఉండేదాన్ని. ఇకనైనా నాకు తమ దర్శన భాగ్యం తరచుగా కలుగుతూండేటట్టు అనుగ్రహించండి," అని వినయంగా అన్నది.

జుబేదా అమె పక్కనే కూర్చుని, "నీ తప్పేమీ లేదు. నీది మంచి హృదయమని నాకు తెలుసు. ఖలీఫాగారికి అభిమాన పాత్రురాళ్ళయిన వారిని చూడబోయే అలవాటు నా కెన్నడూ లేదు. అయినా నేను

సి. మాధవరావు



నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. ఎందు కంటావా? నీవు వచ్చినాక నాకు జరుగుతున్న అనాదరణ గురించి నీకు తెలియ చెప్పటానికి. నే నిప్పుడు బొత్తిగా పనికి మాలినదాన్నయి పోయాను. నా స్థితి సంతాన హీనురాలైన ఉంపుడుగత్తె స్థితికి దిగజారి పోయింది. ఖలీఫా ఇప్పుడు నన్ను చూడ రాడు, నన్ను గురించి విచారించడు," అంటూ ఏడవ సాగింది. ఆమెతో బాటు తుఫ్‌హా కూడా ఏడ్చింది.

మళ్ళీ జుబేదా తుఫ్‌హాతో, "నేను నిన్ను ఒక్క వరం కోర వచ్చాను. ఖలీఫా నెల కొక్క రాత్రి అయినా నా దగ్గిరికి వచ్చేలాగు చెయ్యి. లేకపోతే నేను దాసీలలో జమ అయిపోతాను," అన్నది.

తుఫ్‌హా ఆమె చెయ్యి తీసుకుని కళ్ళ కద్దుకుని, "మహారాణీ, ఒక్క రాత్రిగాదు, నెల పొడుగునా ఖలీఫా మీతోనే గడపాలని నా కోరిక. ఏనాటికైనా మీ దాసీని కావాలని తప్ప నాకు మరొక కోరిక లేదు," అన్నది.

ఇంతలోనే ఖలీఫా వేట నుంచి తిరిగి వచ్చిన విషయం పసిగట్టి, ఆయన తిన్నగా తుఫ్‌హా దగ్గిరికే వస్తాడని తెలుసు గనక, జుబేదా అక్కడి నుంచి శీఘ్రంగా నిష్క్రమించింది.

ఖలీఫా నవ్వుతూ తుఫ్‌హా గదికి వచ్చాడు. ఇద్దరూ కలిసి భోజనం చేసిన తరవాత తుఫ్‌హా ఆయనను జుబేదా వద్దకు వెళ్ళమని ప్రాధేయపడింది. ఖలీఫా ఆమె కోరికను తోసిపుచ్చక, ఆమె గది తలుపు తాళం వేసి, తిన్నగా జుబేదా వద్దకు వెళ్ళి పోయాడు.

ఖలీఫా వెళ్ళి పోయాక తుఫ్‌హా కొంత సేపు తన పుస్తకం చదువుకున్నది. అది మొహం మొత్తినమీదట కిన్నెర తీసుకుని వాయిస్తూ దివ్యంగా పాట పాడింది. అకస్మికంగా ఆమెకు ఆ గదిలో ఏదో వింత పొడ గట్టింది. మైనం వత్తి దీపపు వెలుగులో

ఆమెకు గది మధ్య ఒక వృద్ధుడు ఆనంద పారవశ్యంతో నృత్యం చేస్తూండటం కనబడింది. చూడటానికా వృద్ధుడు రాజఠీవితో, గౌరవనీయుడులాగా కనబడ్డాడు. ఆయన కళ్ళు మూసి వర్ణనాతీతమైన ఆనంద నృత్యంలో నిమగ్నుడై ఉన్నాడు.

తుఫ్‌హాకు భయంతో శరీర మంతా చల్లబడి పోయింది. ఆ ముసలివాణ్ణి ఆమె ఎన్నడూ చూడలేదు. ఆమె గది తలుపులూ, కిటికీలూ మూసి ఉన్నాయి. బయట కొజ్జా వాళ్ళు కాపలా ఉన్నారు. ఆమె దేవుణ్ణి తలుచుకుని, ఏమీ గమనించనట్టే వాయిస్తూ పాడుకుపోసాగింది.

కొంత సేపయాక వృద్ధుడు నృత్యం చాలించి ఆమెను సమీపిస్తూ, "అద్భుతం, అద్భుతం! నన్నెరగవా, తుఫ్‌హా?" అన్నాడు.

"దేవుడు సాక్షిగా ఎరగను. నిన్ను చూస్తే భూతాలలోకం నుంచి వచ్చిన భూతంలా గున్నావు," అన్న దామె.

"నీ వన్నది నిజం, తుఫ్‌హా. నేను భూతాల లోకం నుంచి రావటమేకాదు, దానికి నేనే రాజును. నా పేరు ఇబ్లీస్. భయపడకు. చాలా కాలంగా నేను నిన్ను కాపాడుతూ వస్తున్నాను. నా భార్య కమరీయా నీకోసం ప్రాణాలు విడుస్తుంది. మేమిద్దరమూ ప్రతి రాత్రీ వచ్చి, నిద్ర





పోతూంటే నిన్ను చూసి ఆనందిస్తాం. నీ అందం ఎంత చూసినా కమరీయకు తనివి తీరదు. నే నిప్పు డామె కోరిక మీద నే వచ్చాను. నా వెంట మా లోకానికి వచ్చా వంటే నీకు పెద్ద పదవి ఇస్తాం. ఇవాళ చాలా మంచి రోజు కూడా. నా కుమార్తెకు పెళ్ళి చేస్తున్నాం. విందుకు నీవే ముఖ్య అతిథివి. మా లోకంలో నీ కిష్టమైనంత కాలం ఉండవచ్చు. ఎప్పుడు నీకు తిరిగి రావాలని పిస్తే అప్పుడే నిన్ను ఇక్కడికి చేర్చుతాను,'' అన్నాడు వృద్ధుడు.

అసలే బెదిరిపోయిన తుఫ్హా ఆయన ఆహ్వానాన్ని నిరాకరించలేక పోయింది. సమ్మతి సూచకంగా ఆమె తల వంచగానే ఇబ్లీస్ ఆమెను చెయ్యి పట్టుకుని గోడల కుండా నడిపించుకుంటూ వెలపలికి తీసుకు వచ్చాడు. అక్కడ ఒక గుర్రం సిద్ధంగా ఉన్నది. ఇబ్లీస్ తుఫ్హాను దాని పైన కూర్చోబెట్టగానే అది రివ్వున ఆకాశంలోకి లేచింది. ఆ గుర్రానికి రెక్కలున్నాయనీ, అది ఆకాశమార్గాన అతి వేగంతో పోతున్న దనీ, ఇబ్లీస్ కూడా దాని వెంట పరిగెత్తు తున్నాడనీ ఆ చీకట్లో ఆమె గ్రహించగలి గింది. ఆ వేగానికి ఆమెకు తల తిరిగి స్పృహ తప్పిపోయింది.

ఆమెకు మళ్ళీ తెలివి వచ్చేసరికి గుర్రం ఒక విశాలమైన మైదానం మీద నడుస్తున్నది. మైదానం నిండా పూలుండి, అది పూల తివాసీలా గున్నది. ఆ మైదానం మధ్య ఒక ఎత్తయిన భవనమూ దాని పైన ఎత్తయిన శిఖరాలూ, అనేక ద్వారాలూ, వాటికి రాగి తలుపులూ ఉన్నాయి. ముఖ ద్వారం వద్ద భూత ప్రముఖులు మంచి మంచి దుస్తులు ధరించి ఆమె కోసం ఎదురు చూస్తూ నిల బడి ఉన్నారు.

వారు ఇబ్లీస్‌ను చూస్తూనే, "తుఫ్హా వచ్చింది! తుఫ్హా వచ్చింది!" అని కేకలు పెట్టి, ఆమె చుట్టూ మూగారు. ఆమెను



గుర్రం మీది నుంచి దించారు. ఆమెను అతి విశాలమైన ఒక హాలులోకి తీసుకుపోయి, ముత్యాలు పొదిగిన మేలిమి బంగారు ఆసనం పైన కూర్చోబెట్టారు. ఆ హాలుకు గల గోడలు బంగారంతో చేసినవి. హాలులో ఉన్న స్తంభాలు వెండివి.

తరవాత భూతాల ప్రముఖు లందరూ ఆమె కూర్చున్న ఆసనం కింద ఉన్న మెట్ల దిగువన, హోదావారీగా నిలబడ్డారు. వారిలో ఇద్దరు తప్ప మిగిలిన వారంతా మానవా కారాలతోనే కనిపించారు. భూతాకారు లిద్దరికీ కళ్ళు నుదిటి మీద ఏటవాలుగా ఉన్నాయి. వారికి కోరలు కూడా ఉన్నాయి.

వారందరూ కూర్చున్నాక వారి రాణీ ముగ్గురు అప్సరసల లాటి స్త్రీలను వెంట బెట్టుకుని, చిరునవ్వు నవ్వుతూ హాలుకుండా వచ్చి ఆసనం కింద ఉన్న మెట్లెక్క సాగింది. భూతాల రాణి కమరీయా, ఆమె వెంట వచ్చిన ముగ్గురూ ఆమె చెల్లెళ్ళు.

తుఫ్‌హా ఆమెకు ఎదురు దిగి వచ్చింది. ఇద్దరూ ఆలింగనం చేసుకున్నారు. తరవాత కమరీయా ఒక బంగారు ఆసనం పైన కూర్చున్నది. ఆమె తన చెల్లెళ్ళను తుఫ్‌హాకు పరిచయం చేసింది.

ఇంతలో వడ్డన జరిగింది. వికారంగా ఉన్న ఇద్దరు భూతాలనూ చూస్తూంటే తుఫ్‌హాకు తిండి కూడా లోపలికి పోలేదు. "వాళ్ళిద్దరూ ఎవరు? ఎందు కలా భయంకరంగా ఉన్నారు?" అని ఆమె కమరీయాను అడిగింది కూడా.

"నీకు భయం కలగకుండా ఉండ గలందులకు అందరమూ మానవరూపాలు ధరించాం, కాని వాళ్ళిద్దరికీ అభిమానం అడ్డొచ్చి మానవరూపాలు ధరించ నిరాకరించారు. వీడు అల్‌షిస్బాన్, వాడు మాయిమూన్," అన్నది కమరీయా.

"వాళ్ళ కేసి చూడలేను. అందులో ఆ మాయిమూన్ మరీ ఘోరంగా ఉన్నాడు,"

అన్నది తుఫ్‌హా. ఈ మాట విని ఆ భూతాలు ఆగ్రహించటానికి బదులు, హాలంతా మారు మోగేట్టు నవ్వారు.

విందు పూర్తి కాగానే ఇబ్లీస్ తుఫ్‌హాను పాట పాడమని కోరాడు. ఆమె పాడింది. ఆమె పాట వింటూ భూతాలు పొందిన ఆవేశానికీ, ఆనందానికీ అంతులేదు. వారామె చేత చాలా పాటలు పాడించుకున్నారు. ఆమె అనేక రకాల పుష్పాల మీదా, పక్షుల మీదా పాటలు పాడింది. ఆమె పాడటం పూర్తి చేసినాక అందరూ ఆమెను అమితంగా మెచ్చుకున్నారు. ఆమె కూడా వారిని సంతోష పరచినందుకు సంతోషించి, తానిక తిరిగి వెళ్ళిపోవాలని ఇబ్లీస్‌కు చెప్పింది.

ఈ మాట విని ఇబ్లీస్ చాలా బాధ పడ్డాడు. అతను ఆమెతో, "నీ గురువు ఇషాక్ నాకు తెలుసు. అతనికి నేను కొన్ని రకాల సంగీతం నేర్పాను. కిన్నెర వాయించటంలో ఒక కొత్త పద్ధతి నీకు చూపిస్తాను. అది నేర్చుకున్నావంటే నీకు ప్రపంచ ఖ్యాతి లభిస్తుంది; ఖలీఫా నిన్ను మరింతగా ప్రేమిస్తాడు," అని చెప్పి కిన్నెర మీద ఒక కొత్త పద్ధతిలో వాయించాడు. ఆ వాయింపు వింటూంటే తుఫ్‌హాకు జన్మలో మొదటి సారిగా నిజమైన సంగీతం విన్నట్టు అని





పించింది. ఆమె ఇబ్లీస్ వద్ద కిన్నెర తీసుకుని అతను వాయించినట్టుగానే వాయించింది. ఆమె నేర్పు చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు.

తరవాత ఇబ్లీస్ అజ్ఞపై నౌకర్లు పన్నెండు పెట్టెలు, ఒకే ప్రమాణం గలవి తెచ్చి తుఫ్‌హా ముందుంచారు. "ఇవన్నీ నీకు మా కానుకలు," అంటూ ఇబ్లీస్ ఆ పెట్టెలు తెరిచి అందులో ఉన్న బంగారమూ, వెల లేని బట్టలూ, సుగంధాలూ మొదలైనవి ఆమెకు చూపాడు. కమరీయా ఆమెకు వీడ్కోలు చెబుతూ, "నిన్ను అప్పుడప్పుడూ వచ్చి చూసి పోతూనే ఉంటాను. ఈసారి అదృశ్యంగా కాక చిన్న పిల్ల రూపంలో నీ దగ్గిరికి వస్తాను," అన్నది.

ఇబ్లీస్ ఈసారి తుఫ్‌హాను తన వీపు మీద ఎక్కించుకున్నాడు. కొద్ది క్షణాలలో ఆమె తన గదిలో ఉన్నది; అతడు బహుకరించిన పన్నెండు పెట్టెలూ గది గోడవెంబడి చక్కగా అమర్చి ఉన్నాయి.

తాను ఆ గది వదిలి పోయినట్టే ఆమెకు అనిపించలేదు. తాను కల కనలేదని నిర్ధారణ చేసుకోవటాని కామె తన కిన్నెర తీసుకుని ఇబ్లీస్ వద్ద నేర్చుకున్న కొత్త పద్ధతిలో వాయించ సాగింది.

గది బయట ఉన్న సవ్వాబ్ అనే కొజ్జా వాడు ఈ వాద్యం విని నిర్ఘాంతపోయి, "అరె, మా యజమానురాలే!" అనుకుని నడవల వెంబడి శరవేగంతో పరిగెత్తుతూ ఖలీఫా ఉండే చోటికి బయలుదేరాడు. వాడు పడుతూ లేస్తూ ఖలీఫా శయనాగారాన్ని చేరుకుని, దాని బయట కాపలా కాసే మస్రూర్ ముందు సాష్టాంగపడి, "మంచి వార్త తెచ్చాను, ఏలిన వారిని వెంటనే లేపండి!" అన్నాడు.

"ఈ వేళప్పుడు ఖలీఫాగారిని లేపటమేమిట్రా, వెధవా? నీ కేమన్నా మతి పోయిందా?" అని మస్రూర్ వాణ్ణి తిట్టాడు.

కాని సవ్వాబ్ వదిలి పెట్టలేదు. వాడు చేసిన గోలకు ఖలీఫా లేవనే లేచాడు; "ఏమిటా గొడవ, మస్రూర్?" అని ఆయన కేక పెట్టాడు.

"సవ్వాబ్ తమరిని లేపమంటున్నాడు," అన్నాడు మస్రూర్ భయపడుతూ.

"వాడు నాతో ఏం మాట్లాడాలిట?" అని ఖలీఫా అడిగాడు. ఆయన తన దాసీని బయటికి పంపాడు.

ఆ దాసీది సవ్వాబ్‌ను ఖలీఫా వున్న గదిలోకి తీసుకుపోయింది.

సవ్వాబ్ తాను ఖలీఫాతో మాట్లాడు తున్న సంగతి కూడా మరిచిపోయి, వంగి సలాములు చెయ్యకపోగా, "లేవోయ్ లే! మా యజమానురాలు తుఫేహ్ వాయిస్తూ పాడుతున్నది. వేగమే వచ్చి వినరా, నా తండ్రీ!" అన్నాడు.

ఖలీఫా మాటా పలుకూ లేకుండా వాడి కేసి తేరిపార చూశాడు.

"ఏం? నే చెప్పింది వినబడటం లేదూ? తుఫేహ్ తన గదిలో కిన్నర మీద పాడు తున్నది. వచ్చి విను, నిద్రమొహం!" అన్నాడు సవ్వాబ్ మళ్ళీ.

ఖలీఫా ఒక్క దూకుతో మంచం దిగి, అందిన చొక్కా తొడుక్కుంటూ, "ఏమం



టున్నావురా, వెధవా? నీ యజమానురాలు మాయమయింది, ఎవరో మాయ చేశారని జాఫరన్నాడు. భూతా లెత్తుకు పోయిన వాళ్ళు తిరిగి రారు—ఇంకా నీ యజ మానురాలంటా వేమిటి? ఏం కలగని వచ్చి నన్ను లేపావు?" అన్నాడు.

"కలా? నే నసలు పడుకోందే? తుఫేహ్ చచ్చిపోలేదు. అందుకే నిన్ను రమ్మం టున్నాను, బటానీగింజ మొహం?" అన్నాడు సవ్వాబ్ కోపంగా.

ఖలీఫాకు నవ్వాగ లేదు. ఆయన సవ్వాబ్‌తో, "ఒరే, నీ మాట నిజమైతే నీ పంట పండిందనుకో! నీకు స్వేచ్ఛ ఇచ్చి,

వెయ్యి దీనారాలు బహుమానం చేస్తాను. కలలు కన్నావో నిన్ను కొరత వేయిస్తాను," అన్నాడు.

"అల్లా, అల్లా! నాది కల గాకుండా చెయ్యి!" అని గొణుగుతూ సవ్వాబ్ ఖలీఫాను తన వెంట తీసుకుపోయాడు. గది దాకా వచ్చి ఖలీఫా కూడా తుఫ్‌హా పాట విన్నాడు. గది తలుపు తెరవటాని కాయనకు ఒక నిమిషమల్లా పట్టింది. తలుపు తెరవగానే తుఫ్‌హా పరిగెత్తుకుంటూ వచ్చి ఆయనను ఆలింగనం చేసుకున్నది. కాని ఖలీఫా ఆనందోద్రేకంలో ఒక్క కేక పెట్టి, స్పృహ తప్పి ఆమె చేతులలో నుంచి జారి పట్టుతివాసీల మీద పడిపోయాడు.

తుఫ్‌హా చేసిన శైత్యోపచారాలతో స్పృహ తెలిసిన తరవాత కూడా ఆయన తాగి మత్తులో ఉన్నవాడిలాగా కనబడ్డాడు. ఆ మత్తు వదలటానికి చాలా సేపు పట్టింది. చివర కాయన నిట్టూర్చి, "తుఫ్‌హా, నీవు మాయం కావటమే అద్భుత మనుకుంటే, తిరిగి రావటం అంతకన్న పెద్ద అద్భుతమయింది గద!" అన్నాడు.

తుఫ్‌హా ఆయనకు జరిగినదంతా సవిస్తరంగా చెప్పి, తాను భూతాలలోకం నుంచి పెట్టెలలో తెచ్చిన కానుకలన్నీ ఆయనకు చూపింది. ఆయన ఆ పెట్టెలలో చూసిన పెన్నిధిని వర్ణించటానికి మాటలు చాలవు. అబ్బాసు వంశీయుల అఖండ సంపదకు ఆ పెన్నిధే మూలం.

తుఫ్‌హా తిరిగి వచ్చినందుకు ఖలీఫా బాగ్దాదు నగరంలో ఉత్సవం ప్రకటించాడు. నగరమంతటా దీపాలు వెలిగించారు. రంగురంగుల మతాబాలు ఎగరవేశారు. రాజభవనంలో ప్రముఖుల కోసం బ్రహ్మాండమైన విందు జరిగింది.

ఆ విందులో ఇషాక్ ఇబ్లీస్ పద్ధతిలో ఒక కొత్త కీర్తన రచించి గానం చేశాడు. ఆ తరవాత అంతా సుఖంగా ఉన్నారు.






ఈలోపల సీత దుఃఖ వివశురాలై బెంబేలు పడిపోయింది. ఎటు చూసినా ఆమెకు ఆశ అన్నది లేదు. రావణుడో, రాక్షస స్త్రీలో తనను తప్పక చంపుతారనీ, తాను రాముడి కొరకు ఇంత కాలమూ ఎదురు చూడటం నిష్ప్రయోజన మయిందనీ ఆమె అనుకున్నది. నో రెండిపోతూ ఆమె శింశుపా వృక్షం కిందికి పోయి, ఆత్మ హత్య చేసుకునే ఆలోచన చేస్తూ తన జెడను మెడకు చుట్టుకున్నది. అంతలోనే ఆమెకు శుభ శకునాలు కలిగాయి. ఆమె ఎడమ కన్ను గట్టిగా అదిరింది, ఎడమ భుజం అదిరింది, ఎడమ తొడ అదిరింది. ఆమెకు ఈ శుభ శకునాలు చూసి కొత్త ప్రాణం వచ్చినట్టయింది.

ఇంతసేపూ శింశుపా వృక్షంలో కూర్చుని ఉన్న హనుమంతుడు అంతా చూశాడు. అన్నీ విన్నాడు. కాని అతనికి ఏం చెయ్యటానికీ ఒకంతట పాలుపోలేదు. తాను రాముడి వార్త సీతకు చెప్పి, ఆమె సందేశం రాముడికి అందించాలి. సీతతో మాట్లాడకుండానే తిరిగి పోతే సీతకు రాముడి విషయం తెలియదు; ఆమె ఇక్కడి బాధలు భరించలేక ఆత్మహత్య చేసుకోవచ్చు. అదీ గాక, "సీత ఏమన్నది?" అని రాముడు తప్పక అడుగుతాడు. "నే నామెతో మాట్లాడ లేదు," అంటే రాముడు తన చూపులతోనే నన్ను దగ్ధం చేస్తాడు. పోనీ సీతతో మాట్లాడ తామంటే రాక్షస స్త్రీ లంతా ఉన్నారు. సంస్కృతంలో మాట్లాడితే వాళ్ళకు అర్థం



కాని మాట నిజమే కాని, సీత తనను చూసి రావణుడే మాయా రూపంలో వచ్చా డను కుంటుందేమో! అప్పు డామె భయపడి కెవ్వున అరవగానే రాక్షస స్త్రీలు తన పైకి ఆయుధాలతో వస్తారు. తన చేత దెబ్బతిని వాళ్ళు రాక్షస యోధులను పిలుచుకు వస్తారు. వాళ్ళతో యుద్ధం చేసి అలసిపోతే తాను మళ్ళీ నూరు యోజనాల సముద్రం లంఘించలేక పోవచ్చు. ఒక వేళ తాను రాక్షసుల చేతిలో చావటమే జరిగితే సీత వార్త చెప్పేవాడుండడు.

"నేను చెప్పే మాటలు సీత ఆలకిం చాలి, కాని ఆమె నన్ను చూసి భయపడ గూడదు. అలా మాట్లాడే మార్గమేది?" అని హనుమంతుడు దీర్ఘంగా ఆలోచించి అందు కొక మంచి మార్గం కనిపెట్టాడు. అతను చెట్టు కొమ్మల మాటున సీతకు కనిపించ కుండా కూర్చుని, ఆమెను చూస్తూ ఇలా ప్రారంభించాడు:

"దశరథుడనే ఒక గొప్ప రాజు. ఆయన జ్యేష్ఠపుత్రుడు రాముడు మిక్కిలి అంద మైనవాడు, గొప్ప విలుకాడు. తండ్రి ఆజ్ఞ చేత ఆ రాముడు భార్యనూ, తమ్ముణ్ణీ వెంట బెట్టుకుని అరణ్యాలకు వెళ్ళాడు. అక్కడ అతను ఖరుడు మొదలైన అనేక రాక్షసులను చంపాడు. ఈ సంగతి తెలిసి రావణుడు మాయలేడి సహాయంతో రాముణ్ణి మోసపుచ్చి, అతని భార్య అయిన సీతను అపహరించాడు. రాముడు సీతను వెతుకుతూ వచ్చి, సుగ్రీవుడనే అతనితో స్నేహం చేసి, వాలి అనే వానర రాజును చంపి, ఆ రాజ్యాన్ని సుగ్రీవుడి కిచ్చాడు. ఆ సుగ్రీవుడు సీతాదేవిని వెతకటానికి అన్ని దిక్కులకూ వేలకువేల వానరులను పంపాడు. ఆ ప్రయత్నంలో నేను నూరు యోజనాల సముద్రాన్ని లంఘించి ఈ లంకకు వచ్చి, రాముడు వర్ణించిన సీతను చూడగలిగాను."



హనుమంతు డీ మాటలని మౌనం వహించగానే సీత ఆశ్చర్యంతోనూ, సహజమైన భయంతోనూ తల ఎత్తి శింశుపా వృక్షం కేసి చూసింది. ఆమెకు హనుమంతుడు కనిపించాడు. సీత తన కళ్లనూ, చెవులనూ తానే నమ్మలేక, తాను కలగంటున్నాననీ, కలలో కోతి కనిపించటం చాలా చెడ్డదనీ భయపడింది. తరవాత ఆమె తాను కల కనటం లేదని రూఢిచేసుకుని, భ్రమపడుతున్నాననుకున్నది.

ఈలోపల హనుమంతుడు చెట్టుదిగి వచ్చి, కొంతదూరంలో నిలబడి నమస్కారం చేసి, "అమ్మా, జీర్ణించిన పట్టుచీరె కట్టుకుని, చెట్టుకొమ్మ పట్టుకుని నిలబడి ఉన్నావు, నీ వెవరవు? ఏ జాతికి, ఏ గణానికి చెందిన దానివి? నిన్నుచూస్తే దేవతవనిపిస్తున్నది. నీ తండ్రి ఎవరు? భర్త ఎవరు? పెద్ద దుఃఖంలో ఉన్నావు, నీ బంధువు ఎవరైనా పోయారా? జనస్థానం నుంచి రావణుడు అపహరించి తెచ్చిన సీతవే అయితే ఆ మాట వెంటనే చెప్పు," అన్నాడు.

సీత హనుమంతుణ్ణి చూసి, "నేను దశరథుడి కోడలిని, జనకుడి కూతురిని, రాముడి భార్యను. నా పేరు సీత అంటారు. నేను కాపరానికి వచ్చిన పదమూడో ఏట



నా భర్తకు రాజ్యాభిషేకం జరగనుండగా, దశరథుడి భార్య అయిన కైకేయి అనే ఆమె రామ పట్టాభిషేకం చేస్తే తాను ప్రాణత్యాగం చేస్తాననీ, రాముణ్ణి వనవాసం పంపెయ్యమనీ కోరింది. తండ్రి యాచించిన మీదట రాముడు తాను పుచ్చుకోనున్న రాజ్యాన్ని తిరిగి తండ్రికి ఇచ్చివేశాడు. అతను నారబట్టలు కట్టుకుని వనవాసం పోతూ నన్ను తన తల్లి అయిన కౌసల్య వద్ద ఉండమన్నాడు. నేను రాముణ్ణి విడిచి ఉండలేక వెంట బయలుదేరాను. నా కన్న ముందే నారబట్టలు కట్టి బయలుదేరాడు లక్ష్మణుడు. మేము దండకారణ్యంలో



ఉండగా దుర్మార్గుడైన రావణుడు నన్ను ఇక్కడికి తెచ్చాడు. ఆ రావణుడు నన్నింకా రెండు నెలలు బతకనిస్తాడు, ఆ తరవాత నా ప్రాణాలు తీస్తాడు," అన్నది.

సీత దుఃఖం చూసి హనుమంతుడికి కూడా దుఃఖం వచ్చింది. అతను ఆమెకు దుఃఖోపశమనం కలిగేటట్టుగా, "సీతాదేవీ, రాముడి దూతగా నేను నీ వద్దకు వచ్చాను. రాముడు తన క్షేమం నీకు చెప్పి, నీ క్షేమం తెలుసుకు రమ్మన్నాడు. లక్ష్మణుడు నీకు సాష్టాంగ నమస్కారం చేశాడు," అని చెప్పాడు. ఈ మాటలు వినగానే సీతకు శరీరమంతా పులకరించింది. "మనిషి బ్రతికి ఉండాలే గాని నూరేళ్ళకైనా ఆనందం కలగకపోదంటారు. అది నా విషయంలో నిజమయింది," అన్నదామె.

సీతకు తనపై నమ్మకం కుదిరిందనుకుని హనుమంతుడు ఆమెను సమీపించాడు. ఇది చూసి సీత, రావణుడే వానర రూపంలో వచ్చాడని అనుమానించి, అతనితో ఆత్మీయంగా మాట్లాడినందుకు భయపడుతూ, అశోకవృక్షం కొమ్మ విడిచి నేలపై చతికిలబడింది. తనకు నమస్కారం చేస్తున్న హనుమంతుడి ముఖం చూడటానికి కూడా ఆమెకు ధైర్యం చాలలేదు. ఆమె హనుమంతుడితో, "నీవు నిజంగా రావణుడవే. ఇప్పుడీ కోతి రూపంలో వచ్చావు. ఆ నాడు సన్యాసి రూపంలో వచ్చావు. నే నసలే దుఃఖంతోనూ, ఉపవాసాలతోనూ కృశించి ఉన్నాను. నన్నిలా మరింత బాధపెడుతున్నావెందుకు? ఇది నీకు మంచిదికాదు. ఒకవేళ నీవు నిజంగా రామదూతవే అయితే రాముడి గుణగణాలు వర్ణించు. రామలక్ష్మణుల గుర్తులు చెప్పు. రాముడితో నీ కెప్పుడు సంబంధం కలిసింది? నీవు రామలక్ష్మణుల నెలా ఎరుగుదువు? నరవానరులకు పొత్తు ఎలా కుదిరింది?" అని అడిగింది.



హనుమంతుడు రాముడి గుణగణాలు వివరించాడు. రామున్ని ఆపాదమస్తకమూ వర్ణించాడు. సీతాపహరణానంతరం రామలక్ష్మణులు ఋశ్యమూక పర్వతప్రాంతానికి వచ్చినది మొదలు తాను లంకకు వచ్చిన దాకా జరిగినదంతా పూసగుచ్చినట్టు సీతకు చెప్పాడు. తాను హనుమంతుణ్ణనీ, సుగ్రీవుడి మంత్రిననీ తెలిపి రాముడిచ్చిన ముద్రికను సీత చేతిలో పెట్టాడు.

సీతకు హనుమంతుడి యందు నమ్మకం కుదిరింది. ఆమె ముఖం విప్పారింది. ఆమె ఆంజనేయుణ్ణి పొగడుతూ, అతను మామూలు కోతి కాదనీ, ఎంతో శక్తిసామర్థ్యాలుండబట్టే సముద్రం దాటి రాగలిగాడనీ, రావణుడు కూడా అతన్ని ఏమీ చేయలేడనీ అన్నది. అప్పటికప్పుడే ఆమె రాముడు వచ్చి తనను రక్షిస్తాడనీ, అయోధ్య నుంచి భరతుడు కూడా వానరసేనకు తోడుగా ఒక అక్షౌహిణి సేనను పంపుతాడనీ, రామలక్ష్మణులు సపరివారంగా రావణుణ్ణి యుద్ధంలో హతమార్చుతారనీ కలలు కన్నది. రాముడు తనను తీసుకుపోతాడో పోడో అన్న అనుమానం కూడా ఆమెకు కలిగింది ; తీసుకుపోకపోతే ప్రాణత్యాగం చేయ నిశ్చయించుకున్నది.



రాముడు అస్తమానమూ సీతనే స్మరిస్తూంటాడనీ, ఆమె వెళ్ళిపోయిన తరవాత అతను మాంసాహారమూ, మద్యపానమూ కూడా మానేశాడనీ, సీత ఇక్కడ ఉన్నదని తెలియగానే వచ్చి వాలుతాడనీ హనుమంతుడు చెప్పాడు. తనకు రావణుడిచ్చిన ఏడాది గడువులో పది నెలలు నిండవచ్చాయనీ, మిగిలిన రెండు మాసాలలోగా రాముణ్ణి రమ్మని చెప్పమనీ సీత హనుమంతుడితో అన్నది. ఆమె హనుమంతుడితో ఇంకొక ముఖ్య విషయం కూడా చెప్పింది : లంకలో సీత పక్షం వహించిన వారున్నారు ; వారిలో విభీషణుడూ, అతని



భార్యా, అతని పెద్ద కూతురు నలా, అవింధ్యు డనే ఒక రాక్షసుడూ ఉన్నారు.

హనుమంతుడు సీతతో, "అమ్మా, నీవింక ఒక్క క్షణంకూడా దుఃఖించ నవసరంలేదు. నా వీపు పైన ఎక్కు, ఒక్క క్షణంలో సముద్రాన్ని దాటేస్తాను," అన్నాడు.

హనుమంతుడు చిన్న ప్రమాణంలో ఉండటం చూసి సీత అతని మాటలు నమ్మలేక, "నీవేమిటి? నన్ను వీపున ఎక్కించుకుని సముద్రం దాటటమేమిటి? మొత్తానికి కోతి వనిపించావు," అన్నది.

ఈ మాట హనుమంతుడికి అవమాన మయింది. అతను సీతకు కొంచెం ఎడంగా వెళ్ళి తన శరీరాన్ని భయంకరంగా పెంచాడు. అతని శరీరం మండుతున్నట్టు కాంతి వంతంగా కనబడింది. "సీతాదేవీ, నిన్నే కాదు, ఈ లంక నంతా పాదుతో సహా పెరికి తీసుకుపోగలను. అందుచేత భయపడక నా వెంబడి వచ్చెయ్యి," అన్నాడతను.

కాని సీత అభ్యంతరాలు చెప్పింది. తనను వీపున ఎక్కించుకుని సముద్రం మీదుగా బయలుదేరగానే సాయుధులైన రాక్షసులు చుట్టు ముట్టుతారనీ, తాను భయపడి సముద్రంలో పడిపోవచ్చుననీ, అందువల్ల తనకూ, హనుమంతుడికీ కూడా అపాయం కలగవచ్చుననీ, ఒక వేళ హను మంతుడే రాక్షసుల నందరినీ చంపినా అందువల్ల రాముడికి అపకీర్తి వస్తుందనీ, అందుచేత హనుమంతుడు వెంటనే తిరిగి వెళ్ళి శీఘ్రంగా రాముణ్ణి తీసుకురావటమే మేలనీ అన్నది. హనుమంతుడు పర పురుషుడు గనక అతని శరీరాన్ని తాకటానికి తన కభ్యంతరంవున్నట్టు సీత వ్యంగ్యంగా, "నేను పతివ్రతను. రాముడి శరీరాన్ని తప్ప తాకలేదు. 'రావణుడు నిన్ను తాక లేదా?' అంటావేమో, ఆ సమయంలో నేను ఏమి చెయ్యటానికీ అసమర్థురాలిని, పైన దుఃఖవివశనై ఉన్నాను, నా భర్త దగ్గిర

లేడు. అలాటిస్థితిలో రావణుడు నన్ను తాకాడు," అన్నది.

హనుమంతు డీ అభిప్రాయాన్ని గ్రహించి, "పరపురుషుడి నైన నా వీపుపై ఎక్కటానికి నీ కభ్యంతరం ఉండటం భావ్యమే. నిన్ను నేను చూసినట్టు గుర్తుగా రాముడికి ఏమైనా ఇయ్యి," అన్నాడు.

రాముడికి గుర్తుగా ఉండగలందులకు సీత హనుమంతుడితో ఒక పాత సంఘటన చెప్పింది. ఈ సంఘటన చిత్రకూట పర్వతం వద్ద గంగాతీరాన ఒక ఋష్యాశ్రమంలో సీతా రాములుండగా జరిగింది. ఒకనాడు సీత అక్కడి పుష్పవనంలో విహరించి అలసి పోయి రాముడి తొడపై కూర్చున్నది. అప్పు డొక కాకి వచ్చి సీత రొమ్ముమధ్య పొడి చింది. సీతకు కోపం వచ్చి, మంటిబెడ్డతో దాన్ని తరిమింది. కాని ఆ కాకి వెళ్ళిపోక మాటిమాటికీ సీత మీదికి రాసాగింది. కాకి చేత అవస్థపడుతూండే సీతను చూసి రాముడు హేళన చేసి, కోపం తెప్పించి తరవాత ఆమెను ఓదార్చాడు. తరవాత సీత రాముడి తొడపై తల పెట్టుకుని చాలా సేపు నిద్రపోయింది. ఆమె నిద్రలేవగానే రాముడు ఆమె తొడపై తల పెట్టుకుని తాను కూడా నిద్రపోయాడు. ఆ కాకి తిరిగి వచ్చి సీతను మళ్ళీ రొమ్ములో గీరి మాంసం తినసాగింది. ఆమెకు పెద్ద గాయమై రక్తం కారి రాముడు కూడా తడిశాడు.

కాకి బాధ భరించలేక సీత రాముణ్ణి నిద్ర లేపింది. రాముడు నిద్ర లేచి, సీత రొమ్మున గాయం చూసి మండిపడుతూ, "ఇంతగా నిన్ను గాయపరిచిన దుర్మార్గు డెవరు?" అని అడిగాడు. అతను అటూ ఇటూ చూసే సరికి గోళ్ళనిండా నెత్తురుతో కాకి కనిపించింది. రాముడు దర్భాసనం నుంచి ఒక దర్భను లాగి బ్రహ్మాస్త్రం పఠించాడు. ఆ దర్భ ప్రళయాగ్ని లాగా ప్రజ్వరిల్లుతూ కాకి పైకి వెళ్ళింది.





# జడభరతుడు

పూర్వం ఋషభు డనే రాజుండే వాడు. ఆయన ఇంద్రుణ్ణి సయితం పరాభవించిన శక్తిమంతుడు. ఆయనకు జయంతి అనే భార్య వల్ల అనేకమంది కుమారులు కలిగారు. వారిలో పెద్దవాడు భరతుడు. ఇతని తమ్ముళ్లైన ఇలావర్తుడూ, కుశావర్తుడూ, బ్రహ్మవర్తుడూ, ఆర్యావర్తుడూ, మలయకేతువూ, భద్రసేనుడూ అనే వాళ్ళు వేరు వేరు దేశాలేలారు; ఆ దేశాలన్నిటికీ వారి పేర్లు ఏర్పడ్డాయికూడా.

భరతుడి భార్య పంచజని. వీరిద్దరికీ సుమతీ, రాష్ట్రభుకూ, సుదర్శనుడూ, అచరణుడూ, ధూమ్రకేతువూ అనే కుమారులు కలిగారు. ఋషభుడి అనంతరం భరతుడు రాజై, అజనాభ మనే రాజ్యాన్ని అనేక సంవత్సరాలు పాలించాడు. ఆ తరవాత అతను రాజ్యాన్ని తన కొడుకులకిచ్చి, తపస్సు చేసుకోవటానికి పులస్త్యపులహాశ్రమానికి వెళ్ళి, సాలగ్రామమనే పుణ్యక్షేత్రంలో తపస్సు సాగించాడు.

ఒకనాడు భరతుడు చక్రనదిలో స్నానం చేసి జపం చేసుకుంటూండగా, నిండు చూలుతో ఉన్న ఒక లేడి అక్కడికి నీరు తాగ వచ్చింది. అంతలో ఎటునుంచో సింహ గర్జన వినబడింది. దానికి బెదిరి లేడి నది ఒడ్డుకు ఒక్క దూకు దూకింది. అందుచేత దాని గర్భంలో ఉన్న లేడి పిల్ల కాస్తా నీటిలో పడిపోయింది. ఒడ్డుకు దూకిన లేడి చనిపోయింది.

ప్రవాహంలో పడి కొట్టుకు పోతున్న లేడి పిల్లను భరతుడు పట్టుకుని, తన ఆశ్రమానికి తీసుకుపోయి, అస్తమానమూ దాని పెంపకంలోనే మునిగి తేలుతూ తపస్సు కూడా మానేశాడు. ఆ లేడిపిల్ల మీది మమకారం ఆయనను బతికి ఉన్నంత కాలమూ వదలనే లేదు. చివరకు చనిపోయేటప్పుడు

టి. రామారావు



కూడా ఆయన దానినే చూస్తూ ప్రాణాలు విడిచాడు.

ఈ కారణంగా భరతుడు మరుసటి జన్మలో లేడి అయి పుట్టాడు. కాని పూర్వ జన్మలో తపస్సు చేసి ఉండటం చేత ఆయనకు పూర్వజన్మ జ్ఞాపకం పోలేదు. అందు చేత ఆయన పుట్టుతూనే తల్లిని విడిచిపెట్టి, సాలగ్రామ క్షేత్రానికి వచ్చి, అక్కడనే ఆకులూ, అలములూ తింటూ తన ఆత్మను పరిశుద్ధం చేసుకుని, కొన్నాళ్ళకు లేడి జీవితం చాలించాడు.

ఆ తరవాత ఆయన అంగిరసు డనే బ్రాహ్మణుడికి కొడుకై పుట్టాడు. ఇతను పుట్టినది లగాయతు వట్టి మూఢుడులా గుండే వాడు. గురువు వద్దకు పంపితే చదువుకునేవాడు కాడు, వైదిక కర్మ లేవీ చేసే వాడు కాడు, తిట్టితే జవాబు చెప్పేవాడు కాడు. ఇతని సవతి తమ్ములు ఇతన్ని హేళన చేసి, పనికిమాలిన వాడి కింద జమ కట్టేవారు. అతను మట్టికొట్టుకుని, చినిగిన బట్టలతో ఎక్కడెక్కడో తిరిగేవాడు. ప్రజలతనికి దూరంగా తొలగేవారు. కొందరు రాళ్ళువేసి కొట్టేవారు.

ఈ అవమానాలనూ, దూషణలనూ, దెబ్బలనూ అతను ఎంతో ఓర్పుతో సహించే వాడు. ఎక్కడ ఏది దొరికితే దాన్ని తిని ఆకలి తీర్చుకునేవాడు.

కొంతకాలానికి ఇతని తండ్రి చనిపోయాడు. ఇతని తమ్ములు ఇతన్ని తీసుకుపోయి పొలాలు దున్నించారు, పొలం పనులు చేయించారు. ఎండ అనక, వాన అనక, శ్రమ అనక అతను తమ్ములు పెట్టే తిండి తప్ప ఇంకేమీ తీసుకోకుండా అస్తమానమూ పని చేసేవాడు.

ఆ దేశానికి రాజైన వృషలు డనేవాడు కాళికాదేవికి నరబలి ఇయ్యా నిశ్చయించాడు. అతని భటులు బలి కోసం ఒక మనిషిని పట్టుకొచ్చారు. వాడు పారి

పోయాడు. పారిపోయినవాడి కోసం వెతుకుతూండగా భటులకు భరతుడు కనిపించాడు. వృషలుడు అతన్ని పట్టుకుతెచ్చి కాళికాదేవికి బలి ఇయ్యబోగా, కాళిక రాజునూ, అతని అనుచరులనూ చంపి, ఇతన్ని వదిలింది.

తరవాత భరతుడు దేశసంచారం సాగించాడు. సింధుదేశపు రాజైన రహూగణు డనేవాడు తత్వజ్ఞానం పొందాలనే ఉద్దేశంతో పల్లకీ ఎక్కి కపిలమహాముని ఆశ్రమానికి బయలుదేరాడు. దారిలో పల్లకీ మోసే బోయీలకు భరతుడు కనిపించాడు. అతని వాలకం చూసి ఎవడో దిక్కుమాలినవాడనుకుని, బోయీలు పల్లకీ కొమ్ము ఒకటి అతని భుజాన పెట్టారు.

భరతు డిందు కేమీ అభ్యంతరం చెప్పక పల్లకీ మోయసాగాడు. కాని అతనికి బరువు మొయ్యటం చేతకాలేదు, మిగతా బోయీలతో సమంగా పరిగెత్తలేకపోయాడు, అడుగులు తడబడ్డాయి, పల్లకీ అటూ ఇటూ ఒరగసాగింది. రాజు బోయీలను మందలించాడు. బోయీలు రాజుకు భరతుణ్ణి చూపి, "వీడి మూలానే పల్లకీ అటూ ఇటూ ఒరుగుతున్నది," అని చెప్పారు.

రాజు భరతుడితో వెటకారంగా, "పాపం, పల్లకీ చాలా దూరం మోసి అలసిపోయి



నట్టున్నావు! అంత బలంగా కూడా లేవు. అందుచేత ఆయాసం జాస్తి!" అన్నాడు.

"నేను బలవాలేదు, అలవాలేదు. నాకు శ్రమాలేదు, ఆయాసమూ లేదు. నేనసలు నీ పల్లకీ మోయుటమే లేదు. అది మోసేది ఇంకొకడు!" అన్నాడు భరతుడు.

"కళ్ళకు మొద్దల్లే కనిపిస్తుంటివి, నీ భుజాన పల్లకి ఉన్నదాయె, పల్లకి మొయ్యటం లేదంటావేం?" అని రాజు అడిగాడు.

"రాజా, నీకు కనిపించేది కూడా అర్థం కాకుండా ఉన్నది. అందుచేతనే అబద్ధాలాడుతున్నావు. ప్రత్యక్షసత్యాన్ని నేను చెబుతాను విను. భుజం మీద పల్లకీ ఉన్నది. దాని కింద చేతులూ, రొమ్మూ, ఉన్నాయి. దాని కింద పొట్టా, దాని కింద కాళ్ళూ, వాటి అడుగున పాదాలూ, వాటి కింద భూమీ ఉన్నాయి. అవన్నీ ఒకదాన్నొకటి మోస్తున్నాయి. మధ్యను నేను నీ పల్లకీ మోస్తున్నానంటా వెందుకు? కారణాంతరాల చేత ఏర్పడే తేడాలను గుడ్డిలోకం నిజమనుకుంటుంది. మాట వరసకు నీవు పల్లకీ ఎక్కావు. ఈ పల్లకీ కర్రతో తయారయింది. ఆ కర్ర చెట్టు నుంచి పచ్చింది. అందుచేత నీవు చెట్టునెక్కావంటే అందులో అబద్ధం లేదు, కాని లోకం ఒప్పుకోదు. అలాటి అజ్ఞానం చేతనే నీవు పల్లకీలో మోయబడుతున్నావనీ, ఇంకెవరో మోస్తున్నారనీ అనుకుంటున్నావు," అన్నాడు భరతుడు.

ఈ మాటలు విని రాజు పల్లకీలో నుంచి దిగి భరతుడి కాళ్ళపైన పడి, "మహాత్మా, నేను తత్వజ్ఞానం తెలుసుకుందామని బయలుదేరి కపిలమహాముని ఆశ్రమానికి వెళ్ళుతున్నాను. ఆ జ్ఞానం మీరే ఉపదేశించండి," అన్నాడు.

భరతు డతనికి కావలిసిన జ్ఞానబోధ చేసి పంపేశాడు.



# 27. పీసా గోపురం

ఆర్నోనది (ఇటలీలో) సముద్రంలో పడే ప్రదేశానికి కొద్ది మైళ్ళు ఇవతలగా పీసా అనే నగరం ఉన్నది. ఒకప్పు డది సముద్ర వ్యాపారానికి ప్రసిద్ధి చెందిన ప్రజాతంత్ర రాజ్యం. అది శిల్పానికి కూడా చాలా ప్రసిద్ధి కెక్కినది.

నౌకా యుద్ధంలో తమకు విజయం లభించినందుకు పీసా పౌరులు 1067 లో ఒక బ్రహ్మాండమైన కెథీడ్రల్ నిర్మించటం ప్రారంభించారు. తెల్లని, నల్లని చలువ రాళ్ళతో నిర్మించిన ఈ కట్టడం 1118 లో పూర్తి అయింది.

దీని సమీపానే జగద్విఖ్యాతమైన "ఒరిగిన గోపురం" ఉన్నది. దీనిలోని అలంకార శిల్పం అతి నాజూకైనది. ఈ గోపురానికి "గొర్రెల కాపరి గోపురం" అని కూడా పేరున్నది. ఎందుకంటే, దీని నిర్మాత అయిన గియోటో ఒకప్పుడు గొర్రెలకాపరి.

ఈ గోపురం ఎత్తు 179 అడుగులు. ఇది నేలలో ఒక పక్కకు ఒరిగి పోవటం చేత, దీని పై భాగం 14 అడుగులు ఆ పక్కకు జరిగింది.

ఇటీవలి వార్తలను బట్టి ఈ గోపురం కూలిపోయేటట్టు కనిపిస్తున్నది.



Photo by Bhalchandra Kadne



బహుమతి
పొందిన వ్యాఖ్య

పిల్లి శకునం చూపింది

పంపినవారు :
జి. ఆర్. రెడ్డి, గోపవరం

Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

రైలు చలనం మానింది

పంపినవారు:
జి. ఆర్. రెడ్డి, గోపవరం

# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: పిల్లి శకునం చూపింది

రెండవ ఫోటో: రైలు చలనం మానింది

పంపినవారు: జి. రామచంద్రారెడ్డి,

గోపవరం (కడప జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




ముద్దబంతి పూవులో
మూగకళ్ళ ఊసులో
ఎనక జలమ బాసలూ
ఎందరికో తెలుసులే...


BM
బాబూ మూవీస్

మీరు మీ ఊరిలో మా "చందమామ" అమ్మే చిన్న ఏజంటుగా ఉండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 3-60 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 1-80 పంపండి. ప్రతి ఒక్కంటికి 15 న.పై. చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపేముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం రూఢిచేసుకోండి.



చందమామ పబ్లికేషన్సు

వడపళని :: మదరాసు - 26

# అమూల్ పాల ఆహారమందున్న ఏడు విటమినుల ప్రభావం



**విటమిను బి1**
నరాలను బలపరచి హృదయ కండరాలను సమంగావుంచును.

**విటమిను ఎ**
చర్మమును నున్నితంగా కళ్లను ప్రకాశవంతంగా వుంచి పెరుగుదలను వృద్ధిచేయును





**విటమిను బి2**
నోరును ఆరోగ్యవంతంగా వుంచును.



**విటమిను బి6**
కండరాలను సడలించును.



**విటమిను సి**
అంటు రోగాలను నివారించి శీతాదనమును నిరోధించును.



**విటమిను డి**
బలమైన ఎముకలను, ఆరోగ్యమైన పండ్లను వుంచి పిల్లల రోగాలను నివారించును.

**నయాసినమైడ్**
జీర్ణవృద్ధి, బలమైన నరాలను పెంపొందించి చర్మమును శుభ్రంగా వుంచును.



అమూల్ పాల ఆహారములో యీ 7 విటమినులేగాక, మాంస కృత్తులు, కార్బొహైడ్రేటులు, క్రొవ్వు, కాల్సియం, ఫాస్వరం సమపాళ్లలోవున్నవి. అమూల్ ప్రశస్తమైన ఆహార విలువలే ఆధునిక తల్లులకు మన్నిక. మీ బిడ్డకు ఎంతో మంచిది.

**అమూల్** పాల ఆహారంలో మీ బిడ్డకు వలసిన 7 విటమినులు కలవు.







ASP/ABF-35

గుండె జలుబును
పోగొట్టుకోండి ఇదుగో

# అమృతాంజనము

శమనం కల్గించే పది రకాల ఔషధాలు చేరిన మందు కాబట్టి అమృతాంజన్ అమోఘమైన శ్రమ నివారిణి. అతి కొంచెమే చాలు కాబట్టి ఒకే సీసా నెలల తరబడి వస్తుంది మీకు. 70 ఏళ్లు పేరు మోగిన నమ్మకమైన ఇంటి మందు. అమృతాంజన్ కండల నొప్పులకు, బెణుకు, తలనొప్పి, ఇతర నొప్పులు, జలుబులు బాధలకు కూడా అమోఘమైనది. వాతావరణంలో మార్పు సంసార తాపత్రయాలు నొప్పులు, జలుబులు ఇతర బాధలు కలిగిస్తాయి. అవసరానికి అందుబాటుగా అమృతాంజన్ సీసా ఒకటి ఇంట్లో ఉంచండి.

అమృతాంజన్ 10 రకాల
ఔషధాలు చేరిన మందు




అమృతాంజన్ క్రొత్తగా అట్ట పెట్టెలో వస్తూంది. సీసా 'అలూ' క్యాప్‌తో సీలు చేయబడి ఉంటుంది.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM-2331

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ :

# నాకు అసలే ఏలినాటి శని,
# పైగా అష్టమ రాసిలో గురువు




"నీ బాధల కారణమునకు నీ జాతకము చూడ నక్కరలేదు! నువ్వు అలిసిపోయి నీర్సముగా ఎందుకూ పనికిరాకుండా ఉన్నట్లు ఎన్నో నెలల నుండి చూస్తున్నాను! నువ్వు డాక్టరు దగ్గరకు వెడితే మంచిది!" అంది అత్తయ్య. "ఊరుకో తల్లీ, ఎప్పుడూ డాక్టర్లూ, మందులూ అనే ధోరణే నీకు" అన్నాను. కాని ఆవిడ పట్టుపట్టి నన్ను డాక్టరు దగ్గరకు తీసుకు వెళ్ళింది.



డాక్టరు నన్ను పరీక్షచేసి యిలా అన్నారు. "మీ ఒంట్లో ఏమీలేదు. మీకు నీర్సముగా, అలసటగా ఉన్నట్లు ఉండడము తగినంత పోషణ లేదనడానికి చిహ్నము. మీరు రోజూ హార్లిక్స్ త్రాగండి." నాకు హార్లిక్స్ ఎందుకు అనుకొని నేను ఎరుగున్న సిద్ధాంతితో ఆ సంగతే అన్నాను. ఆయన "డాక్టర్లు చెప్పినట్లు చేయడమే మంచిది." అన్నారు.



అందువలన, ఒక మంచి రోజు చూసుకొని హార్లిక్స్ త్రాగడము ప్రారంభించేను. నాకు క్రమంగా శక్తి ఉత్సాహములు కలిగేయి. ఇంట్లో అత్తయ్యా వాళ్ళూ సంతోషించేరు. నా గ్రహస్థితి బాగుండడము వల్లనే డాక్టరు నాకు హార్లిక్స్ సిఫార్సు చేసేరని నేను ఎంతో సంతోషించేను!




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

JWT-HL-4822 (a)

